శ్రీమాన్ జ్యోతిష కార్యాలయాధిపతులును, "జ్యోతిర్విద్యాభూషణ"
బిరుదభూషితులును, ఆసుకవులు, శతావధానులు నగు
కే. శ్రీనివాసాచార్యులవారొసంగిన
యభిప్రాయము.

---

గీ॥ అరసినాడ వసంతప్రభాఖ్య నలరు
నాటకంబును భవదీయనవ్యవైఖ
రీవిరాజిత మది కవితావిపాక
లలిత నీవాణి ప్రభల శ్రీరామశాస్త్రి ॥

మ॥ విరతిప్రాసములన్ నిరర్థకపదావిఖ్యాతి తత్తద్రస
స్ఫురణన్ రీతులవైపరీత్యమును వాచోయుక్తి నిర్మాధురీ
కరణం బర్థనిరూఢిలోన ననలంకారం బనౌచిత్యమున్
వరలన్ బోదు ప్రబంధబంధురకవిత్వం బౌ వసంతప్రభన్ ॥

చ॥ జిలిబిలిముద్దుపల్కులను జేరిచి ముత్తెములట్లు కూర్చి నీ
తుల వెలయించినావు సుమతుల్ గొనియాడుదు రయ్య నాటకం
బుల రచియింపఁ జాలుదువు పోయినపోకడ లింపు నింపు నీ
కలవడు మించుకీర్తి హృదయాళులలో నచిరంబె పెంపుగా ॥

మదరాసు.
17—6—17.

కే. శ్రీనివాసాచార్యులు,
శతావధాని.

# ఉపోద్ఘాతము.

ఆంధ్రభాషాభిమానులారా!

భారతమాతకు శిరోరత్నమనఁదగు బొంబయినగరమున నేను వాసముచేయుచుండిన కాలమున, గెయిటీనాటకమండలివారు ఘూర్జర భాషను, నీతిదాయకమగు వసంతప్రభా నాటకమును బ్రదర్శించు చుండిరి. వారి ఖేలనానైపుణ్యమును, గానమాధుర్యమును, శృంగారాభినయమును, గథకుంగల నీతికి వింత విన్నాణమొసంగుచుండ, ఘూర్జరభాషాజ్ఞానములేని యాంధ్రుఁడనగు నే నాకర్షింపఁబడుట కేమి వింత. నాటకమును జూడవలెనను గుతూహలము, దినదినమును హెచ్చగ నే నెన్నిమారులో నాటకమున కేగుచుంటిని. ప్రదర్శనమును జూచునపుడీనాటకము తెలుగుననాడ నెప్పుడుజూతునాయని విచారపడుచుంటిని. స్వభాషాభిమానము జనులను విడనాడదుగదా! మన దేశమునగల తెలుగుపండితుల నొకరిద్దరిని, తెలుగుభాషను వసంతప్రభా నాటకమును వ్రాయుడని ప్రార్థించి, కథను సంగ్రహముగ వ్రాసిపంపితినిగాని వారు నాయభీష్టమును దీర్పరైరి. ఈకార్యమునకు స్వయముగ నేను బూనుటకు, తగినంత భాషాజ్ఞానము లేమివలనను, తదనుగుణ్యముగ దేహమనారోగ్యమున నుండుటయు, కార్యావసరమున దేశదేశములకును దిరుగుటయును సంభవించి, నాటక మింతవరకును దెలుఁగున వ్రాయంబడలేదు.

ఇట్లుండగ ఆంధ్రపత్రికాధిపతులును, దేశసేవాపరాయణులును నగు మ-రా-రా-శ్రీ, కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి యనుగ్రహమున నాకు మదరాసు నగరవాసము సంప్రాప్తమాయెను. నా పుణ్యావశమున శ్రీమాన్ జ్యోతిర్విద్యాభూషణులును, శతావధానులును, సంస్కృతాంధ్ర పండితులునునగు మ-రా-రా-శ్రీ, కుందూరి శ్రీనివాసాచార్యులుగారి స్నేహితము లభింప వారిప్రోత్సాహమున నే నీనాటకమును వ్రాయగలిగితిని.

ప్రథమమున ఘూర్జరభాషనుండి సరియగు నాంధ్రీకరణమును జేయఁదలంచితి. గాని పూర్తియగు అచ్చుప్రతి నాకులభింపలేదు, వారికీర్తనలు మాత్రము ముద్రితమై యుండుటవలన నాకాప్రతి మాత్రము లభ్యమైనది. దానిననుసరించి నాటకము నాంధ్రీకరించుట దుస్తరము. గనుక కథను హృదయముననిలిపి, తదనుగుణ్యమగు రంగములను దృష్టిపథముననిడి, తెలుగున వ్రాయుటకు మొదలిడి, సర్వేశ్వరానుగ్రహమున పక్షము దినములలో పంచమాంకములును బూర్తి చేసితిని. ఘూర్జరభాషనుగల నాటకములకును, దెలుగునగల నాటకములకును భేధములెన్నియేని గలవు. రంగస్థలమున యుద్ధము, మరణము, యిత్యాదులు కొన్ని పాశీనాటకముల గాననగు. అవి మననాటకముల నుండవు. మననాటకములకు నియమములు గలవు. వారికీ నియమములులేవు. గనుక నాటకమున మార్పులనుజేయక తప్పకుండుటచే, స్వారస్యమునకు భంగము కలిగింపక, కథ నచ్చటచ్చట కొన్ని మార్పులను జేసితిని.

ఇఁక నీతివిషయము కొంత విమర్శింతము. ఈనాటకమునగల ముఖ్యాంశము నీతిబోధకము, భారత భాగవత రామాయణాది గ్రంథములన్నియు నీతిబోధకములు. జనులను నీతిమార్గావలంబకులుగా జేయుటకు, భారతమున శ్రీకృష్ణుండు, దుర్మార్గుఁడగు దుర్యోధనుని వధింపంజేసి, సన్మార్గుఁడగు ధర్మరాజునకు రాజ్యమునొసంగెను. భాగవతమున శ్రీకృష్ణుండు హిరణ్యాక్ష, హిరణ్యకశ్యపులను సంహరించి సద్గుణులగు తనభక్తులను గాపాడెను. రామాయణమున శ్రీరాముఁడు త్రిలోకకంటకుఁడగు దశకంఠునిజంపి, సన్మునుల రక్షించెను. ఈగ్రంథములన్నియు సద్గుణ దుర్గుణములకుగల తారతమ్యములనుజూపి, దుర్మార్గప్రవర్తనమువలన గలుగుచున్న కష్టములను జనులకుజూపి, సన్మార్గావలంబకులుగా జేయుటకు, మహాత్ములవలన వ్రాయంబడినవి. నాకీగ్రంథములయందుగలభక్తి యసమానము. గాని గ్రంథములను జదువ నారంభించినయెడల కొలదికాలమున నవి ముగియకుండుటయు, ననేకులకు

గ్రహించు సామర్థ్యమలవడకుండుటయు, సంభవించుట సకలజనుల కును దెలిసినవిషయము.

ఇఁక నాటకమునుగురించి విమర్శింతము. ఉపవులు నేత్రోత్స వమునుజేయును. గానము రసవంతమై మనోహరమై స్వాంతమున కత్యానందము గలిగించును. శృంగారాభినయము నవరసముల నులి కించుచు, జనుల కేకీభావమును స్థిరపఱచును సద్యఃఫలమొసంగును. నీతిదుర్నీతులను రంగమునఁజూపిన వేషధారుల నభినందించుటయు దూషించుటయు క్రమముగ కొన్నిదినములు జనులుపక్రమించెదరు. గాన నీతికి మహోన్నతపదవి నొసంగుటకు, దుర్నీతిని కొంతప్రవేశ పెట్టి దానిని తుదకణచి, జనులకు నీతివలన గలుగనున్న సత్ఫలములను జూపుట, నాప్రయత్నమున కంతకును ముఖ్యకారణమని విన్నవించు చున్నాను. భాషాభిమానులు సదయహృదయమున గ్రంథమునగల లోపాలోపములను నాకు దెలిపినయెడల, వారికి కృతజ్ఞతాపూర్వక మగు వందనములర్పించి, ద్వితీయముద్రణమున సవరణ చేసుకొనగల వాడను.

ఈనాటకము ముద్రింపించునపుడు, శ్రమయనక, నాకు సాయము చేసిన మ-రా-శ్రీ, యం. వెంకటరావు పంతులుగారికిని, మ-రా-శ్రీ, పునుగు శంకరశర్మగారికిని, శీఘ్రకాలముననె ముద్రించిన శ్రీనికేతన ముద్రణాశాలాధిపతికిని నాకృతజ్ఞతాపూర్వకములగు వందనములర్పించు వాడను.

ఇట్లు విన్నవించు

సుజనవిధేయుడు,

ప్రభల - శ్రీరామశాస్త్రి.

# కథాసంగ్రహము.

---

రాజునకు వసంతుఁడు ప్రథమభార్య కుమారుఁడు. ఆమె గతించెను. ద్వితీయభార్య మదనాదేవి. ఆమెపుత్రుఁడు చంద్రహాసుఁడు. ఆమె యౌవ్వనవతి. ఆమెదాసిచతురిక. సద్గుణవంతురాలు. మదనాదేవికి,సవతికుమారుఁడగు వసంతునిపై ప్రబలానురాగముకలిగి, చతురిక నాపనిఁదీర్పుమని బలవంతపెట్టును. చతురిక చెప్పిన నీతివాక్యము లామెకు రుచింపవు. కడకు చతురికమూలమున వసంతుని తనభవనమునకు రప్పించుకొని, వానిని నయభయముల తనయభీష్టము దీర్పుమని ప్రార్థించును. అతఁడు సజ్జనుఁడగుట, దుష్కృత్యమునకుఁ బాల్పడక, తల్లి ననేకగతులం బ్రార్థించి, నిష్ఫలమని గ్రహించి, రాజ్యమును బరిత్యజించి విరాగియై, తనసతితోడ నరణ్యమున కేగి, యోగీశ్వరుని సత్కృపవలన, నతనికుటీరమున గాలముబుచ్చుచుండెను. రాజున కీవార్త తెలిసి విచారించును. మదనాదేవి, తన సవతికుమారుఁ డడవుల కేగినయెడల, జనులు సంశయించి పలువిధముల నిందింతురనియు తా నాతనికడ కేగి, మరల పురమునకుఁ గొనివచ్చెదననియు బలికి, సేనాధిపతిని, కొంతసైన్యమును వెంటఁదీసుకొని యడవుల కేగును. వసంతుని బలిమిమైఁబట్టి బంధించి నగరమునకుఁ జేర్చును. విరాగియై వసంతుఁడు, సర్వేశ్వరు నారాధించుచు నగరమున నుండును.

మదనాదేవి, వసంతునిపైఁగల యనురాగమును విడనాడి, సేనాధిపతిని వరించి సురతక్రీడలఁదేలి యాడుచుండెను. అతని పరిచారకుఁడును, చతురికయు, నంతఃపురమున జరుగుచున్న దుష్కృత్యములకు విచారించి, మదనాదేవి కుమారుని గాపాడవలెనని గనిపెట్టియుందురు. చంద్రహాసుఁడు తల్లి మందిరమునకుఁ బోవనెంచును. సేవకుఁడు వారించును. వినక రాకుమారుఁడు లోనికిజని, తల్లిని మందలించును. సేనాధిపతి వానిని గత్తిచేఁ బొడిచిచంపును. రాజున కీయుదంతము మాటుపఱచి, నీపెద్దభార్య కుమారుఁడు వసంతు డీహత్య చేసిపోయెనని మదన

రాజుతోఁజెప్పి దుఃఖించును. రాజు మరల వసంతుని గహానములకంపి వేయును.

చివరకు నిజమును రాజు గ్రహించి, దుర్మోహమున మదన తన కుమారుని జంపించినందులకు దుఃఖించి, తన ప్రాణము దీయుటకును సిద్ధముగానున్నదని గుర్తెఱిఁగి, దుర్యశమును బొందుచు జీవించుటకన్న మరణము సర్వోత్తమమని దలంచి, విషమిశ్రితమైన పాలను ద్రాగి లోకాంతరగతుఁడగును.

రాజ్యాధిపత్యము సేనాధిపతికి లభించెను. సవతికుమారుని కానల కంపించి, కన్నకుమారుని జంపించి, మగనికి స్వయముగ విషమునిచ్చి చంపిన మదనాదేవి, సేనాధిపతి రాజుగనుండుటకు సమ్మతించెను. తాను సుఖముగనుండవచ్చునని భావించెను. సేనాధిపతికి రాజ్యాభిషేక మయినంతనె, తనభార్యను విడనాడక, సురతక్రీడలఁదేలుచు, మదనాంతః పురమునకు రాకుండెను. మదన విచారించి, నీభార్యను జంపివేయుమని సేనాధిపతికి బోధించును. గాని, సేనాధిపతి తనభార్యను హెచ్చుగ ప్రేమించి, మదనను దానిదాసిగానుండ నియమించును. మదన, తాను జేసిన దుష్కృత్యములకు తగినశిక్షను భగవంతుడు చేసెనని దుఃఖించు చుండ, సేనాధిపతి మరల మదనను లాలించి విషమునిచ్చును. తెలియక విషమునుద్రాగి, నిజముగ్రహించి, బల్లెముచే నతనిని బొడిచిచంపును. తానును గతించును.

అడవుల కేగిన రాకుమారుని మరల నగరమునకుఁ జేర్పవలెనని యోగీశ్వరుఁడు నాగకన్యకా వేషమును ధరించి, రాజునువంచించి, యతని చంచలత్వము నెఱింగించి, వసంతప్రభల నిరువురను రాజ్యము నకు దీసుకొనిపోయి, రాజ్యాభిషిక్తులఁజేయును.

సం గ్ర హ ము.

# ఇందువచ్చు పాత్రములు.

| పురుషులు. | స్త్రీలు. |
| --- | --- |
| సూత్రధారుడు | |
| రాజు | చతురిక |
| వసంతుడు | మదన |
| చంద్రహాసుడు | ప్రభ |
| యోగి | దేవకన్యలు |
| సేనాధిపతి | మధురిక |
| సైన్యము | |
| సేవకుడు | |
| సన్యాసి | |



శివాయనమః.

# వసంతప్రభ.

## నాంది.

ఉ॥ శ్రీరమణీశుఁ డాత్తజన • సేవితుఁడార్యనుతుండు, సజ్జనా
ధారుఁడనంతుఁడవ్యయుఁ డు • దారగుణాఢ్యుడు సర్వధారుణీ
భారహరుండ కాముకుఁ డ•పారదయామయు డచ్యుతుండు శ్రీం
గారపదారవిందుఁడు సు•ఖంబునఁగాచునుగాత సభ్యులన్ ॥

చ॥ ఎవనిపదాబ్జముల్గొలిచి • యెవ్వనినామము సంస్మరించిలో
నెవని దృఢంబుగానిలిపి • యెవ్వని సత్కథలెల్ల కాలమున్
దవిలిభజించి సజ్జనులు • తారుతరింతురో ? అట్టి ఓంనమ
శ్శివయననొప్పు శంభుఁడు వి•శేషరయమ్మున మిమ్మునోముతన్ ॥

ఆ-వె॥ త్రిభువనముల కొక్క•దివ్వెయై వెలుగుచు
ననవరతము తమము • నణచునట్టి
లోకరక్షకుండు • లోకేశ్వరుండైన
నీశుఁడణచు మోహ•పాశములను.

:(౦):-

# వసంతప్రభ.

ప్రథమాంకము - ప్రథమరంగము.

మదనాంతఃపురము.

మదన॥ (ప్రవేశించి) [అనుబంధము 1]
హా! దుర్భరము, దుర్భరము,

చ॥ పొరిఁబొరిమారుఁడేయు శరముల్ తనువెల్ల దహింపఁజొచ్చె, నా
తరమభరింప, నాథుఁడు యథాస్థితి వేటతమిఁ మహాటవిఁ
దిరుగుచు నున్నవాఁడు, మదిదీరగ కౌఁగిటఁజేర్చి మోహసా
గరమును దాటునట్లెవరు గాని సహాయముఁ జేయరైరిగా॥ 4.

చ॥ దినమొకయేఁడుగా గడచుఁ దీరనిదుఃఖముచేత నెట్టులీ
తనువు భరించుదానఁ దలిఁదండ్రులు నాకపకారులౌచు చే
సినపని కేమిచేయుదును, సిగ్గగు; వార్థికనాథునింక నొ
ల్లను, మనమా! భరింపుమ ప్రలాపము మానుమ, యింత తాళుమా॥

మ॥ మనమా! ఇంతటితీవ్రమా, వలదు నీమానమ్ముగాపాడుకొ
మ్మనయం బాతఁడు సమ్మతించు ననకమ్మా, వాఁడు పుత్రుండు, స
జ్జనుఁ డౌదార్యగుణుండు, నాశ్రితుల వాత్సల్యుండు నన్యాంగనా
ళిని యెన్నండును జూడడింక ననుబాళిఁ గూడునా? ప్రేమనై॥ 6.

కం॥ తలచిన ఘోరము, భర్తకుఁ
దెలిసినఁ దలఁదీయుఁ, గీర్తినిలువక జను, లో
కులు నిందించెదరటు పైఁ
గులమా చెడు, హానివచ్చుఁ గొడుకునుగూడన్ ॥ 7.

ఇంతకాలమునుండియు రాజునకు సనిత్సై, పేరు ప్రతిష్ఠలఁగాంచి, ఒక్క కుమారునింగని, కట్టకడ కీదుస్సిద్ధివలన యశమును మన్ననఁగలిపి, కులము నపకీర్తిని ద్రోసి, రాజును, నాపుత్రుని, రాజవంశమునంతయును జెఱుప సాహసించితిని.

అయ్యో! ఈకట్టిడితలంపు నాకు కలుగుట కేమికారణము?

కం॥ వెనువెంటఁ దగిలిమారుఁడు
ఘనతర బాణాగ్ని నేసి • కాల్చుచు వేటా
డిన, మేమెటుబోదుము, చే
యు, నుపాయముదోచదాయె • హా! యేమందున్ ॥ 8.

ఏమైననేమి? ఎంతవచ్చిననేమి? కులమునకుఁ గళంకమువచ్చిన నేమి? నా యశముపోయిన నేమి?

రాజువిని దండించుగాక, నాతలఁ దీయుగాక, బంధువులు దూఱుదురుగాక, సిరి సంపద లడుగంటునుగాక, ఏమైననగుగాక, వసంతుని గౌగిటఁజేర్చి, మనసార రతి సౌఖ్యముల నానందమునొందకున్న నేమనగలనా? నేవరించిన ప్రియతముఁడైన నాథుఁ డతడే, అతనిఁగూడిన పాపములేదు.

మదినిజనింపని సంభాషణలచే, నటనలచే, వేషములచే, బ్రీతిలేని పతినివలపించి సంతోషపెట్టుటకన్న, నేవరించినవానిని గూడుటచే నెక్కుడు పాపమువచ్చునా?

నాకెపుడు వానిపైఁ జింతకలిగెనో, పాతివ్రత్యమునకపుడే భంగముకలిగినది. నే నీవిషయముమానిన మాత్రమున నాపాపమెట్లుబోవును? ఎటులనో కలిగినది. ఇక భయములేదు.

ఉ॥ లోనజనించెవహ్ని, యెటు•లోగనుటల్ మనుటల్ భరింపఁగా
లేను, వృథా భయంబికను•లేదు, వసంతుఁడె నన్నుఁగూడఁడా
నేనరుఁడై వసంతుఁడయి • హెచ్చగురూపములోడఁబుట్టె, నె
న్నైననుగాని, వాడె హితుఁ•డై పతియై గతియై రమించుతన్ ॥ 9.

(అని చిత్రపటమునుజూచి)

అహా! ఈ నవమన్మథాకారుని చిత్రపటము సజీవముగా నున్నదిగదా! అట్లు కాకున్న నీ సుందరాకారుఁడు నేను నిదురించువేళ నాచెంతఁజేరి శృంగారములన్ని చేయునా? అంతమోహమును జూపునా? ఇట్లు నన్ను బాధించునా?

వసంతా ! నిజాకారమునవచ్చి సుఖింపరాదా? నేఁడలదంటినా ? నీకేమిభయము? సర్వము నీయధీనముగదా ? (ఆలోచన నభినయించి) చతురికా !

చతు॥ (ప్రవేశించి) అమ్మా ! నమస్కారములు.

మద॥ నీ వేమిచేయుచున్నావు ?

చతు॥ తల్లీ ! పనులుముగిసినవి. సావిత్రీచరిత్రఁ జదువుచున్నాను.

మద॥ (హేళనముగానవ్వి) ఆకథ నిజమని భావించితివా ? యముఁడు మానవులకు గోచరుఁడగునా? మరణించినవారు సజీవులగుదురా ? ఇదేమివెఱ్ఱి ?

చతు॥ అమ్మా ! కథ కల్లయే కానిండు. పాతివ్రత్యమున కంతటిప్రభావములేదా ? ప్రపంచమున పతివ్రతలులేరా ?

కం॥ ఆసతి మాసతికన్న, ను
మాసతి కన్ననుగడించె • మాన్యత, నట వీ
వాసముఁజేయుచుఁ బతిని గ
తాసునిఁగాకుండఁజేసె • నది ఘనమొకదా ॥ 10.

మద॥ అట్టి వనితలుండిరని నేనమ్మజాలను. ఇప్పు డీచర్చతో నేమియవసరము. నాకొక కార్యము నీవలన సఫలముగావలెను.

చతు॥ ఆజ్ఞలనుమోదించుటకు సేవకురాలు సిద్ధముగానున్నది.

మద॥ చతురికా ! నిన్ను నాసోదరిగా భావించి నామది నెఱింగింపవచ్చునా ?

చతు॥ అమ్మా ! ఇట్లడుగుకోనవలెనా ? మీకు హితురాలనెగదా.

మద॥ సఖీ ! చతురికా !

కం॥ వాసంతునిఁగని యాతని
నాసించితి, వానిభోగ • మాసించితి, నా
యాసంబు నొందితిని, బెను
గాసిం బడియున్నదానఁ • గామాతురతన్ ॥ 11.

చతు॥ అమ్మా ! మన్నింపవలెను. సేవకురాలనని నామాటలఁ బెడచెవినిబెట్టకుము. సారము గ్రహింపుము. తల్లీ ! పరపురుషునిసంగమ మత్యంతదూష్యము. ఇక సవతిసుతునిపైఁ జింతనుంచి వానినిగూడ నెంచుటకుఁగల పాపమున కంత్యము లేదుగదా వారితమబోటిలకీపనితగునే? ఇంతకుమించిన దుష్కార్య మొండుగలదే ?

గీ॥ స్వేచ్ఛమైనట్టి రాజవం • శంబునందు
జననమొందితి, రారాజు • వనితవైతి
ఇట్టిదుర్బుద్ధి నీకెట్లు • బుట్టెనమ్మ
విషము పాల్కడలిని నుద్భ • వించినట్లు ॥ 12.

తల్లీ ! రాసుతుని సద్గుణంబులను వినియుండవా ?

గీ॥ పరులవనితలఁ దల్లులఁ • బలెఁదలంచు,
సద్యశోభరితుండయి • చాలఁజాల
వినుతికెక్కెను నీమాట • వినము ; నిజము
బలికితినినన్ను మన్నింప • వలయునమ్మ ॥ 13.

లోకమున సాధారణముగ తుచ్ఛులగువారు.

గీ॥ పనికిమాలినబోధల • బలిమిఁజేసి
శుద్ధులను నొక్కత్రుటిలో, న • శుద్ధులుగను
జేసి, వెనుకను జప్పట్ల • సిగ్గుమాలి
గొట్టుచుందురు, ఈపని • కూడదమ్మ ॥ 14.

సజ్జనుల చెలిమివలన నొకవేళ లాభములేకున్నను, జెడుబుద్ధులంటవు. నష్టము రాదు. కీడుగలుగదు.

అమ్మా ! ఈబోధ నీకెవరు చేసిరమ్మా ?

మద॥ చతురికా ! నామర్మమును గుర్తెఱిగి నీవిటులాడఁ జెల్లునా ? నాప్రాణములను నీచేతఁ బెట్టితిని. వసంతునిగూడకున్న బ్రతుకుటయె కష్టము.

మత్త॥ మోమునఁ జిఱునవ్వు మొల్కలు • ముద్దుగుల్కుచునుండునే,
కామదేవుని కన్నమిన్నగు • కాంతులఁ వెలుగొందునే,
నామనోరథ సిద్ధికాతని • నమ్మియుంటిని దేలనే,
కోమలీహృదయేశ్వరుఁ సమ • కూర్చి తాపమడంపవే ॥ 15.

వాని నెటులైనఁ దీసికొనిరమ్మా. పొమ్మా.

చతు॥ తల్లీ ! ఇంతవెఱ్ఱి మీకుతగునా ? మీరు కామోద్రేకమున నిట్లాడుచున్నారుగాని, యిందుఁగలకీడు తమకుమాత్రము తెలియదా ? ఈమహాకార్య మింతటి యపాయకరమని నుడువఁజాలను.

ద్విపద.

చతు॥ అమ్మకో! నీమేలు • నాసించికులము
వమ్ముగాకుండగ • వచియింతునిటుల.

మద॥ కులమేలచెడును, సం•కోచంబునీకుఁ
గలుగుట వింతగ • గాన్పించెచెలియ.

చతు॥ నలుగురు వినినంత • నవ్వులాడెదరు,
పలుతెఱంగులను, దు•ర్భాషలాడెదరు.

మద॥ ఇతరులెవ్విధమున • నిదివినవచ్చు,
మతిచెడినీవిట్లు • మాటాడరాదు.

చతు॥ మొదటనేనాతని • సదనంబుఁజేరి
యిదియొఱిగింపగా • నెట్లగునమ్మ.

మద॥ ఇంతటిపనికింత • చింతనీకేల
సంతసింపుచుఁబొమ్ము • సరగునరమ్ము.

చతు॥ తల్లీ! ఎన్ని విధముల బ్రతిమాలుకొనినను, మీరు దూరమాలోచింపకయున్నారు. నేనేమిచేయగలను? రాసుతుఁడు మస్వాధ్యుఁడని తమరెఱుంగుదురు. దీన కీడు వాటిల్లనున్నది. మీ అన్నమును దినుచుండుటచేత నింతగఁ జెప్పవలసి వచ్చినది. ఇఁక దైవమె మీబుద్ధిని ద్రిప్పవలెను నేనేగెదను.

(అని ముందరికివచ్చి.)

ఉ॥ ఎంతటిమానసీయము, జ•నించినవంశము, పట్టినట్టిరా
జెంతమహాయశుండు, భువి • నెంతటి గౌరవనీయదేవి, యి
ట్లింతటి భోగమబ్బియును • హీనగుణంబులు దప్పవయ్యె, దు
శ్చింతలు మానవయ్యె,నిసి • సీ, విధిచెయ్దములెంత చిత్రముల్ ॥

(నిష్క్రమించును.)

## ప్రథమాంకము - ద్వితీయరంగము.

### నందనవనము.

ప్రవేశము - వసంతప్రభలు.

వసం॥ సుందరీ! నీనుడువులను వినుటవలన డెందమమందానందమై రాజిల్లుచుండును. ఇఁక నొకసారి నీమృదుమధుర స్వరములచేఁ బాతివ్రత్యప్రభావమును వర్ణింపుము. శ్రమ యొసఁగినందులకు మన్నింపుము.

ప్రభ॥ మనోనాథా! నన్నింతగఁ గొనియాడెదవేల? మీయాజ్ఞల నిర్వర్తించుటయే నాకర్తవ్యము. ఉత్తరింపుడు.

సీ॥ ఇలఁగల, సకలవాంఛలను, దీర్పఁగశక్తిఁ
గలవాఁడు, పతియంచుఁ, దలపవలదె
గౌరవాదులకు నాధారభూతుండయి
నిలువాఁడు పతియంచుఁ దలపవలదె
ఎన్నికష్టములబ్బ నీ, గావఁగాశక్తి
గలవాఁడు పతియంచుఁ దలపవలదె
ఘనదేవతాళిక న్ననునెక్కుడై, విరా
జిలువాఁడు పతియంచుఁ, దలపవలదె.

ఆ-వె॥ సర్వనోములకును సర్వవ్రతములకు
సకలమునకుఁగలుగు సత్ఫలంబుఁ
బతినిగొలుచుసతికి నతులితగతినబ్బు
దైవమనగ నితర దైవమెవఁడు? 18.

నాథా! నిక్కముగఁ బతికిమించిన దైవముగాని, పతిభక్తికిమించిన వ్రతము గానిసతికిలేదు. ఎన్నికష్టములు వచ్చినను బతినివిడనాడక ధైర్యమునుజెప్పుచు నాతని సేవించియుండుట సతికిధర్మము.

వసం॥ మనోహరీ! సతియొకాదు పతిని మన్నింపవలసినది? పతికిని సతియెడ నెక్కుడు గౌరవముండవలెను.

సీ॥ కలిమిలేములను, నొక్కటిగాగభావించి
గడుపంగసతులంచు • ననవలదె,
సంసారనావను • సమముగానడుపంగ
శాధ్యులు సతులంచుఁ • బలుకవలదె,
ఇలనునాకముసేయు • నింతులెతగువార
లంచు నెమ్మదినిభా • వించవలదె
పతులకు హితములు • బలికి, దుర్గుణములఁ
దొలగింప, సతులంచు • దలపవలదె,

గీ॥ మాననీయులుదారుల • మాత్యసములు
వెలదులేయని మదిలోన • నిలుపవలదె;
వారినతిదయఁ బ్రేమించి • గౌరవించి
పలుతెఱంగుల లాలించి • పలుకవలదె ॥ 19.

సుందరీ! సంసారబాధ్యత సతిపతుల కిరువురకును సమముగాగలదు. సతికి పతి యెడనున్న గాఢానురాగము, పతికిని సతియెడ నుండవలెను. అట్లుండినసె కాపురమునకు శోభ. ఇదేల ప్రేయసీ! నీవిటుల దీనవదనముననున్నావు? ఏమికారణము? ఇట్లెన్నడును నీసుందరముఖారవిందము వన్నెదొఱఁగియుండఁ జూడనుగదా?

ప్రభ॥ ప్రాణనాథా! మనమిరువురమును గహనములనుండినట్లు నిన్నటిరేయి నొక కలగంటిని. సర్వవస్త్రాలంకారరహితులమైయుంటిమట, యతిపూజ సలుపుచుంటిమట. చిత్రముగదా!

వసం॥ ప్రాణేశ్వరీ! ఇందులకు సంతోషింపవలెను. దీనత్వమేటికి?

కం॥ మనమిరువుర మటవులయో
గిని బూజించుచునుగడుప • కేవలసుకృతం
బని సంతోషింపక, లో
ననుమానము గల్గియుండ • నగునా? లలనా! ॥ 20.

ఆచింతను విడువుము. భయములేదు. అంతర్భవమునకేగి విశ్రమించెదము రమ్ము.

(నిష్క్రమించుదురు.)

ప్రవేశము - చతురిక.

[అనుబంధము 2.]

చతు॥ ఆహా! రతీమన్మథులనుబోలిన వీరిసంభాషణముల నంతయువింటిని. యువరాజు సద్గుణసంపన్నుడు. ప్రభాదేవి పతివ్రతాశిరోమణి. భార్యాభర్తలిరువురు గహనమున కేగినటుల ప్రభాదేవి కలగనెనట. ఏమి సంభవింపనున్నదో తెలియకున్నది. నేనతనికడకేగి, రాసుతున కమ్మగారి సందేశమును దెలిపెదను. చేయవలసిన కార్యము న్యాయమైనను, నన్యాయమైనను, దాసినగుటచే యజమానురాలియాజ్ఞల నిర్వహింపకఁ దప్పునా? అకటా! సేవకావృత్తి అధమాధమముగదా.

కం॥ చీటికిమాటికి దొరలను
వాటముగాఁ బొగడవలయు ; ♦ వారిమనంబుల్
నూటిగఁగనుఁగొని పనులను
బాటవమునఁ జేయవలె, నె ♦ బానిసమెచ్చన్ ॥ 21.

(నిష్క్రమించును.)

ప్రవేశము - వసంతప్రభలు.

ప్రభ॥ నాథా! విచారపడెదరేల? తల్లిగారిసందేశ మవశ్యమాదరణీయము. తామువైళమ పోవుటుచితము.

ఆ-వె॥ జనకుఁడూర లేడు ♦ జననికిదుర్భర
బాధగలిగి చెలిని ♦ బంపియుండు
గాన తాముబోయి ♦ కనుఁగొనుటుచితంబు
రాసుతా! మనోహ♦రా! వసంతా! ॥ 22.

ఆలస్యము జేసెదరేమి?

వస॥ దేవీ! నీవాక్యము యదార్థముగావచ్చును. గాని యింత నిశాసమయమున సందేశమంపుటయె సంశయముగనున్నది. పోవకతప్పదు. పోయెదనుగాని సంశయము గలుగుచున్నది.

తరల॥ పడతి యౌవనవంతురాలని ♦ భావమందున సంశయం
బొడముచున్నది, మారుతల్లెటు ♦ లున్నదో గ్రహియింపక

య్యేడకు రేయినిబోవ్రుటెట్లగు? నెట్లు బోవకయుందు? హా
చెడుగువచ్చునో? మేలువచ్చునొ? చెప్పఁజాల; మనోహరీ!

ఇప్పుడే పోవుచున్నాను. దైవముగలడు.

(ప్రథ నొకముద్దుపెట్టుకొని నిష్క్రమించును)

---

## ప్రథమాంకము - తృతీయరంగము.

### మ ద నా ం తః పు ర ము.

బహిర్భవనము.

ప్రవేశము - వసంతరాజు.

వసంత॥ ఆహా! ఇది కడుచిత్రముగ నున్నదిగద. నిశాసమయమున సవతితల్లి కబురు పంపుటయు, అందుల కానొదించి నేను వచ్చుటయు, ఇచట సఖులెవ్వరును గాన్పించకుండుటయు, అన్నియును నాసంశయమునకు సహకారిగనె యున్నవి.

చ॥ ఒరులెవరేని లేరు, సఖులుందురు వారునుగానరారు, దు
ర్భరతరమైన చీకటులు బ్రాకుచునున్నవి మిన్నునంటి, నే
నరిగితి నిందు, చేయతగినట్టి యుపాయము తోచదాయె, ని
బ్బరముగ నేవకుంబలె. గవాటముగాచుట కల్గెదైవమా॥ 24

అయినను గొంతవడిచూచెదను.

(ప్రవేశము - మదనాదేవి.)

మద॥ తాసుతా! ఇదేమి! అంతర్భవమునకు రాఁదగవా? ఇటుల మసలుట తగునా? కూర్చుండుము.

వసం॥ తల్లీ! మన్నింపవలెను. నిశాసమయమున వచ్చితిని.

మద॥ వచ్చిననేమాయె. పనియున్న రాకతప్పునా?

వసం॥ అమ్మా! ఆపని వినగోరెదను.

మద॥ రాజా! ఇంత ఆతురతయేల? కొంచము తాళుకొనజాలవా? నీమనసునకు సంతసము గలిగించియె పంపెదను లెమ్ము.

వసం॥ జననీ! అట్టివిషయము నెఱుఁగుటకు మిక్కిలి కుతూహలముగనున్నది.

మద॥ వసంతా! నిజమాడితివి. ఇదియే మగవారి నైజము. మొదట నెక్కుడుగ నాతురతను జూపించి, కడకు నిరాదరణ చేయుదురు.

వస॥ అమ్మా! నేనట్టివాఁడనుగాను.

కం॥ తనయుఁడనగు కతమున, నో
జననీ! తమమదికి సంతసము గూర్పఁగ నే
పనిగల దది చేయుదు; తా
రనుమానము మానియుండ నగు నిక్కముగన్. 25

ఆడినమాటను దప్పువారు మావంశమున లేరు.

మద॥ వసంతా! మనమిరువురము సవయస్కులము. నామది కానందము కలుగు కార్యము నొనరింపుము.

వస॥ అమ్మా! నాకెట్లు తెలియును.

మద॥ రాజా! ఇంతయెఱుఁగవా? కానిమ్ము. నాకొక సంశయముగలదు. అది తీర్చెదవా?

వస॥ అవశ్యము.

మద॥ యువరాజా! పక్షపాతమును మాని పలుకనగు. వినుము.

కం॥ సతిపతుల రూపసంపద
లతులితగతి నమరియున్న నదిశోభనమౌ
సతిపతుల కమరకుండిన
వెతలిరువురి మదిని, బాధపెట్టుచునుండున్ ॥ 26

వస॥ అమ్మా! సత్యమేయగు.

మద॥ మంచిది. రాజనరేంద్రుఁడే వయసున ద్వితీయవివాహమాడెను?

వస॥ ముసలితనమున.

మద॥ నీవు నిజముగ ధర్మరాజంతవాఁడవు. చెప్పుము. అప్పటికి చిత్రాంగి పడుచుతనమున నే యున్నది?

వస॥ అవును.

మద॥ ఆమెకు తనపతియెడ గాఢానురాగ ముండకుండుట సహజము.

వస॥ అవును.

మద॥ సారంగధరునకిచ్చి చిత్రాంగిని పెండ్లిచేసినయెడల ధర్మము గాఢముండి యుండెడిది.

వసం॥ అటుల వివాహముచేసిన బాగుండెడిది.

మద॥ ఆమె నాముసలిరాజు బలవంతముగ వివాహమాడలేదా ?

వసం॥ నిజము.

మద॥ వసంతా ! నీవు న్యాయమూర్తి వగద. సారంగధరు డామెను నిరాకరించు టేమిన్యాయము ?

వసం॥ తల్లీ ! అంతపాపమా ! సారంగధరున కామె సవతితల్లిగదా !

మద॥ పక్షపాతమువదలి పలుకుము. సారంగధరు డంతగట్టిపట్టున నుండగూడదు.

వసం॥ అమ్మా ! అట్లు పలుకుచున్నారేమి ? ఇదేమిధర్మము ? సుతులు తల్లులఁగూడ వచ్చునా ?

మద॥ అయిన వారు ఇతరవనితల గూడవచ్చుననియా నీమతము ?

వసం॥ అయ్యో ! అది వేరువిషయము. ఆవిషయములతో మనకవసరము లేదు.

మద॥ మగవారలిటులనె తప్పించుకొనుట. పోనిమ్ము. నవయస్కులుకాని సతీపతులకేది శరణ్యము ?

వసం॥ అమ్మా ! తమరెఱుగనిది యేమిగలదు ? అట్టివారు

కం॥ మనపూర్వకర్మ ఫలమిది
యని మదిఁదలపోసి, నిర్మలాచరణమునన్
మనుజులు తనువుల గడుపుట
జననీ! సద్ధర్మమంచు జాలవచింతుర్ ॥ 27

మద॥ రాసుతా ! కామాతురతనున్న వారికీనీతులు పాటించునా ? అయ్యో ! ఎంతని విచారపడుదును ? ఏమిచేయుదును ? మాటలతోడనే ప్రొద్దుపుచ్చెదవేమి ? తెలిసెనా?

కం॥ మదిగలిగిన తాపము నా
కిదియని జెప్పంగలే నదేమో, గనుకన్
పదపడి నినురప్పించితి
సదయా ! నీనేర్పుఁజూప సమయమిదిగదా ॥ 28

గ్రహింపుము.

వసం॥ (స్వగతము.) [అనుబంధము 3.]

అక్కటా ! మోసపోతిని. ఇక నుపాయమేమి ? ఈమందిరము నెట్లువిడుతును? ఈమె కేసమాధానము చెప్పుదును ? ఎంతమాట వింటిని! చెప్పిచూచెదను.

(ప్రకాశముగ)

కం॥ దిగులొందుచు నిత్తఱిఁబో

దగునాయని సంశయాత్మఁ • దలకుచు, మిముజూ

డగవచ్చితి, నాజ్ఞలదా

టగజాలక ; తల్లి, అక్క•ట్రా ! ఫలమిదియా ॥ 29

మద॥ రాపుత్రా ! రాజవంశమున జనించి, రూపలావణ్యాదులమించి, రసికులలో రసికుఁడవని పేరుగాంచిన నీకీభయము తగునా ! ఇట్లనుటకు నీనోరెట్లాడెను ? అయిన నేను నీకొనరించిన యపకారమేమి ? సవయస్కులుగాని సతీపతుల మనోవేదనను తెలిపితిగాక. అట్టివారియెడ నీకుమాత్రము కరుణగలుగదా ? నీహృదయము వజ్రమా ? ఇటుపై నీదయ.

వస॥ అమ్మా ! నన్నింత చులకనగ భావించితిరేలనమ్మా ? నాగుణములు వినియుండరా ? ఎన్నడైన, నెవరైన నాయందెట్టి దోషనిరూపణగాని చేసియుండిరా? మీరెఱుగరా ?

తల్లీ ! మీరు నామనోధైర్యమెఱుంగుట కిట్లాడితిరేమో ?

కం॥ జలనిధులింకిన, రవిచం

ద్రులుదారులదప్పినన్, న•దులు పొంగిజనం

బుల నాశముజేసిన, నా

కలనైనను గోరనన్య • కాంతలఁదల్లీ ॥ 30

ఇక నాకు సెలవొసంగెదరా.

మద॥ మనోహరా ! నామనవి నాలకింపుము. నన్ను చిన్నబుచ్చకుము. నీవు ధర్మస్వరూపుడవని విందు. దీనరక్షకుడవని యెఱుంగుదు. సద్గుణగుణ విరాజితుడవనియుఁ దెలిసియున్నది. ఎంతపరితాపము, ఎంతవిచారము, ఎంత సంకటము, ఎంతవేదన, నేబడినది నామనసెఱుగును ? భగవంతుఁడెఱుగును. కడకు ఇది నాలోపముకాదని స్థిరపరిచితిని. నీకు పాపముకాజాలదనియు నిశ్చయించితిని. మనసు దృఢమాయెను. ధైర్యముహెచ్చెను. నిన్ను రప్పించితిని. భావగర్భితముగఁ బలికితిని. నీవు వలదనుచున్నావు. దుష్కృత్యమనుచున్నావు. ఎన్నటికిని కాదు. నిక్కముగ కాదు. కాజాలదు. నీచిత్తము,

వసం॥ (స్వగతము) ఆక్కటా ! ఇట్టిచింతతోడ నాతల్లిగారు నన్నురప్పించినది ? కను గొనలేనైతినే, మోసపోతినే, కార్యము చెడెనే, ఇఁక నాగతియేమి?

తండ్రీ! పార్వతీరమణా ! నీవేనాదిక్కు.

సీ॥ వెలుపింతయును లేక ♦ పరకాంతలనుజూచి
చెనకంగనెంచిన ♦ చెనటిఁగాక ;
సత్యవాక్ప్రౌఢిని ♦ సంచరింపక బొంకు
పోహాళిం చెడిమాన ♦ వుండగాక,
పెరవారిదుఃఖము ♦ లరయక హింసించి
మదిమెచ్చఁదిరుగు, దుఃర్మముఁడఁగాక,
కన్నబిడ్డలఁబోలె ♦ గాంచక ప్రజల, నా
రడిబెట్టినట్టి దుఃష్టుఁడనుగాక,

గీ॥ యుండియుండిన, నాజన ♦ కుండసత్య
ములనుబల్కని విఖ్యాత♦పురుషుఁడైన
పాపము హరించుఁగాత, ఈ ♦ పడఁతిమనసు
నీతికినిలొంగి, బాయు దుఃర్కీతినిఁక ॥ 31

(ప్రకాశముగా)

తల్లీ ! మదనాదేవి ! ఏమి మాటలాడితివమ్మ? ఎంతటినీతిని బోధించితివమ్మ? అయ్యో ! పరవనితలనెప్పుడైనఁ గన్నెత్తిచూచి యుందునా ? మనసునఁదలంచి యుందునా? పలుకరించియుందునా ? అచింతయేలేదె.

మద॥ [అనుబంధము 4.]

సుందరాకారా! రాకుమారుఁడవై యుండి, అబలయగు నొకతరుణిని దీర్ఘవిచారమున ముంచుటమాత్ర మేమిధర్మము ? నీకొరకై ప్రాణముల సైతముఁ బాయనుంటిని సుమా ! స్త్రీహత్యచే మహాదోషమును బొందుటకన్న, దాని నాదరించి యేలుకొనుటచే నెక్కుడుపుణ్యము గడింపుము. నామాట వినుము. వలదనకుము. పాపమనకుము. పరవనిత యనకుము. దుర్యశమనకుము. మదనక్రీడల నీవానందింపుము. నన్నానందింపఁజేయుము. లోకమున పవిత్రులెవరు ?

సీ॥ కోడివై యమరుల • జేమజేయిలుసొచ్చి
మునిపత్నిఁ గలియ క•థను జదువవొ ;
శిష్యుఁడనంచు యా•చించిన శశి, గురు
వనితనుగూడిన • వార్తవినవో ;
వలపించి శ్రీకృష్ణుఁ • డెలమిరాధికచిత్త
హారుఁడైన భంగిని • కనుపడదో ;
అమరులగురుఁడన్న • యాలిని మోహించి
రతిసౌఖ్యములఁబొందు • గతినెఱుఁగవో ;
గీ॥ అట్టివారలె, మోహము • బట్టలేక
లలితయౌవనరూప వి•లాసవతుల
హాయిగనుగూడి యుండరే! • యఘమటంచుఁ
దొలఁగిపోయిరె? ఈపట్టు•తొలఁగరాదె ॥ 32

చ॥ అడవులఁ గందమూలముల - నాకుల నాకలిఁదీర్చు మౌనులే
పడఁతులఁజూచి మోహమునఁ-బాదములొత్తుచు సేవఁజేయఁగా
బుడమిభరించు రాజవయి-మూర్ఖతఁబూని వరించినట్టినా
యెడ, దయఁజూపకుంటి, విధి-యేటివిచిత్రము ; రాకుమారకా

మోహనాకారా ! నీమనోహరాకారముఁ జూచినది మొదలు నామది చంచలమై నిన్నుంగూడ బలవంతఁ బెట్టుచున్నది. పాపమగుగాక, పుణ్యమగుగాక, అపకీర్తియగుగాక. కులముచెడుగాక, రాజు దండించుగాక, ఏమైననగుగాక. నీవు నన్నాదరింపకున్న నాప్రాణములుండబోవు. స్త్రీహత్యచే దోషము మహత్తరమైనది.

చ॥ మరుఁడను వేటకాఁడు దయ•మాలి కడుంగడు వెంటనంటి, డం
బర మొనరించు పూనికను • బల్మిని బైఁబడి పెల్లుపెల్లుగా
శరములఁ బేర్చియార్చె, మన•శక్యముగామి, భవాంఘ్రిరేణువుల్
శిరమున నిల్పి, గొల్చుమది, • జేసివరించితి; రాకుమారకా ॥ 34

చ॥ నినుగను భాగ్యమబ్బకను•నిత్యము రేబవలెల్లకాలముఁ
మనమునఁ జింతనిండగను • మాటికిమాటికి మాసుతాయటం

చనయము గల్వరించితిని ♦ హా కనుఁగొంటిని, వేడుకొంటి, నా
తనువుభరింపుమంటి, మరు ♦ తాపము దుస్సహమంటి, రాసుతా॥ 35

వసం॥ (స్వగతము) జగద్రక్షకా! స్థిరభక్తిని నిన్ను సేవించిన ఫలమిదియా?

చ॥ కలుషహరుండవయ్యు, నొక ♦ కామినినీతికి దూరమాచు, లోఁ
దలచె సుతుఁ రమించుటకుఁ ♦ దాళుదె; యిట్టిమహోగ్రమైన కో
ర్కులు జనియించు స్వాంతమును ♦ గూర్తువె; ఆర్తులఁబ్రోవరావె; నా
కిలనిది యిట్టులీవు ఘటి ♦ యించితే; తండ్రి! బిరానఁజెప్పవే॥ 36

చ॥ దురితమడంచు వేల్పవయి ♦ దుష్టతతోఁదులఁదూగు తల్లిపైఁ
గరముదయారసంబు చిలు ♦ కన్ దగుసుమ్ము, మహాత్మ! మోహమున్
దొరగి యశంబుగోరి, తన ♦ దుస్థితి తానెయెఱింగి, తల్లి, స
త్వరమున నన్ను బంపగను ♦ భావమునియ్యవె; ఫాలలోచనా!॥ 37

(ప్రకాశముగా)

తల్లీ! నమస్కారములు. నీయెడఁగల మాతృభక్తిని, నీసదనమునకు రా జూరలేని సమయమైనను వచ్చితినిగాని, దుష్కృత్యముల వినుటకుగాని, ఆచరించుటకుగాని వచ్చినవాడనుగాను. పరవనితలు నాకుతల్లులు. దేవతాసమానులు. పూజనీయులు. నీవు నాయమ్మవు. నన్ను, కుమారుని, మోహించితివి. ఇంతటి చెడుబుద్ధి నీకెట్లుపుట్టెనో, నీకెఱుక. సర్వవ్యాపకుఁడగు పరమేశ్వరునకెఱుక. నన్నడిగినమాత్రముననె, నిన్నువరించి దుర్యశమునకుఁ బాత్రుఁడనగుదునని భావించితివా? అట్టి సమాచారములు నాసమీపమునకు రాఁదగవు. నేను వినఁదగను. తల్లీ!

సీ॥ పతిఁజూడ ధారుణీ ♦ పతిగాని, సామాన్యుఁ
డంచు నెమ్మదిని భా ♦ వించకమ్మ;
నలుగురు వినినంత ♦ నగుచునునీకత
నాటకంబుగ జేసి ♦ జాటరమ్మ;
బంధుకోటికినీవు ♦ బలమైనశత్రువై
తలయెత్తిబెట రాఁ ♦ గలవటమ్మ;
రారాజుదేవివై ♦ రాజిల్లునీకిట్టి
బుద్ధి కెడునుబొందఁ ♦ బుట్టెనమ్మ;

గీ॥ నేను గాదన్న మాటకొంకక • నాకుఁ గట్టి
కైటుంబవనసన్ను, నత్త్యాగి • బాయుమన్న
ఎంత ఘోరము, దుష్కృత్య • మెంతపాప
మింతయని సాహసించితి • వెంతతప్పు ॥ 38

మదనోద్రేకముచేత తమ రిట్లాడుచున్నారు గాని, తమకుఁ దెలియని ధర్మము గలదా? శాంతింపుఁడు. నన్ను క్షమింపుఁడు.

మదన॥ ప్రాణనాథా! అన్నియును విని తుదకు నన్ను పరాభవానలమునఁ గాల్ప నెంచితివా! నీతండ్రిని జేపట్టిన నాటనుండియు, నతనికి దేహము దత్తముఁ జేసితినిగాని, జీవమంతయు నీపరమైయుండు. నీచిత్రపటముఁ జూడనిదినము లేదు. ఏనాటికైన నామనోభీష్టము తీరకపోవునాయని ధైర్యముతో బ్రతికి యుంటిని. తగుసమయ మెప్పుడుచురాదయ్యె. నేడు నిరాదరించి నీవేగినచో, నేను బ్రతుకుట దుర్లభము. ఇది నిశ్చయము. నమ్ముము. నేను నీసొంతపత్నిని. నన్నేలుకొమ్ము. ఇది నా మొర, నా ప్రార్థన, చిన్న బుద్ధియును.

మత్త॥ మారసుందరమూర్తి నీరతి • మానినీమణికి నాసతోఁ
గోరఁగోరఁగ దైవసత్కృప • గూడెనంచు దలంచితిన్.

వసం॥ జేరఁదీసి యిదేటిమాటలు • సిగ్గుమాలినచిం చెదో,
ధారుణీశ్వరుఁగొల్చుచుండెడి • ధర్మపత్నికిఁ జెల్లునే? ॥ 39

మదన॥ మారుఁడుగ్రశరంబు లేయఁగ • మానవృత్తిఁ జరించువా
రేరిజూపుము; నెక్కడైన; ని • దేటిపంతము రాసుతా ॥

వసం॥ ఘోరపాపము జేయుమంచును • గోరుటెంత యధర్మమో;
వారిజాక్షి! తలంపుమా, నను • బాపుమా, దయనింపుమా॥

మద॥ ఆ-వె॥ పుత్త్రిడాసతోడ • పూవిల్తు తోభోగ
మబ్బెనంచు దేహ • ముబ్బుచుండె;
కట్టికడకు నన్ను • గారవింపకఁబోను
వంచుఁ జింతసేయ • నైతినిపుడు ॥ 41

రాకుమారా! నవమన్మథాకార! నీచింతమానఁజాల, నీరూపము మఱువఁజాల, నీమోహము విడువఁజాల, నిన్ను బోనీయఁజాల! పాపముగానిమ్ము. ఘోరనరకము

గానిమ్ము. కులము చెడనిమ్ము. రాజు శిరచ్ఛేదనముఁ జేయనిమ్ము తల్లిదండ్రులు నిందింప నిమ్ము. బంధువులు దూఱనిమ్ము. వేయేల? నాసుఖము, నామానము, నాప్రాణము, సర్వస్వము నీయధీనము. నీదాసురాలను. దయమాత్రము విడువకుము. తొలగిపోకుము. నిరాదరించకుము. ఇందులకు భగవంతుఁడుసాక్షి.

[అనుబంధము 5.]

వచ॥ అమ్మా! ఈవికారము నీకిప్పుడు శాంతింపదు. నాపాడురూపమునుజూచియే భ్రమసితివి. శల్యమాంసపుసాది వికారమై పనికిమాలిన దేహమునాసించి, చిరార్జితపుణ్యోపేతమగు సత్కీర్తిని తృటిలోనఁ బోఁగొట్టుకొనఁదలఁచితివి. జన్మజన్మములందును ఘంటాపథమై మోగనున్న దుష్కీర్తికి భయంపడవైతివి. వలదువలదని యెంతగ ప్రార్థించినను నామొరాలింపవైతివి. అయ్యో! నేనేమిచేయఁగలను? అన్యులతో నీయుదంతమింతయు వెలిబుచ్చను. నమ్ముము. భయపడకుము. నాప్రార్థన నంగీకరింపుము.

చ॥ కులమపకీర్తి దోషమునఁ♦గూలును, దుర్యశమంకురించు, లో
కులు పలుగాకులై పలుక♦గూడని భంగిని బల్కుచుందు, రా
వల యముఁడుగ్రుఁడౌచు, మన♦పాపఫలంబును నిచ్చుఁ, గాన ని
ట్టుల నొనరింపఁగూడదు, క♦డుంగడు దూష్యమునుమ్ము, తల్లిరో!॥ 42

ఈరాజ్యమున నేనుండను. నాకువలదు.

చ॥ ఇదివరకెన్నఁడేని జని♦యింపని జ్ఞానము నేఁడుకల్గె, నె
మ్మదిని, జగంబులిట్టులనె♦మాయనుజచ్చుచుఁ బుట్టుచుండు సం
పదలు తొలంగు, సర్వమును ♦ పాపము, గాననిదే, విరాగినై,
మది గహనాంతరంబులను ♦ మాపతిఁ, గొల్చుచునుందుఁ దల్లిరో॥

కం॥ నీసుతునకు రాజ్యంబును
వాసిగనొసఁగుదును వాఁడె♦పాలించును, నా
యాసంబులేని గహనా
వాసంబే, నాకు తగుని♦వాసంబిటపై॥ 44

అమ్మా! ఇఁక నీచిత్తము. నేనుబోయెదను. నేఁడే గహనాంతరముల దారిని బట్టెదను. దుశ్చింతలమాని, సత్కీర్తిని గడింపుము, మానముఁ గాపాడుకొనుము.

తండ్రీ! సూర్యనారాయణమూర్తీ!

చ॥ కనులకుఁగోచరుండవయి, ♦ కర్మములందుఁ గర్మసాక్షివై
ఘననిబిడాంధకారమును ♦ గాల్చి మహోజ్జ్వలకాంతులిచ్చుచుం,
మనువర వంశకర్తవయి ♦ మాన్యత కెక్కిన నీవు, తల్లిగా
రిని, నయమార్గమందునన, జరింపఁగఁ జేయుము; కీర్తినిల్పుమా;॥45

(నిష్క్రమించును.)

మదన॥ వాని సుస్థిరస్వాంతము నెఱింగియుండియు, జేలనైతిని. అయ్యో! రాకుమారుఁ డడవులకేగుదునని వెళ్లియున్నాడు. నిజముగ వెళ్లునా? వానిచక్కదనమైనసుజూచి తృప్తిపడుభాగ్యము నైతముదప్పునా?

ఉ॥ సుందరమూర్తి; శాంతగుణ♦శోభితుఁ డార్యనుతుండు, సత్కృపా
నందుఁడు, ధర్మదేవత, య♦నందగు సచ్చరితుండు; వాని; నే
నందముగావరించి, మహా♦దాటవిఁజేర్చిన పాపినైతి, నే
మందు మనోహరాకృతిని ♦ నైన గనుంగొనఁజాల; దైవమా॥ 46

(నిష్క్రమించును.)

# వసంతప్రభ.

——:(o):——

## ద్వితీయాంకము - ప్రథమరంగము.

### ప్రవేశము - రాజు.

రాజు॥ గీ॥ కటకటా! యెట్టికష్టము గలిగె; పుత్ర
రత్నమటవికిఁ జనె నప్రయత్నముగను
రాజ్యరమనెల్లఁ డంట, వీరాగిబోలి
మెలఁగునంట, శ్రీమహేశ్వరుఁ గొలుచుచుండి ॥ 47

సుతరత్నమా! నిన్నుఁ జూచి నీతల్లిని మఱచుచుంటిని. త్రిలోకవిఖ్యాతమైన నీ ధవళయశమువిని సంతోషించుచుంటిని. స్థిరమగు నేకపత్నీవ్రతుఁడవని వేనోళ్లు శ్లాఘించుచుండ, ముదమొందుచుంటిని. నీకు రాజ్యరమను స్వాధీనముచేసి, నీకీర్తిప్రఖ్యాతుల కానందింపఁ దలంచుచుంటిని. గహనమునకేగినపుడు నీకనువగు ఫలములగోయించి తెచ్చియుంటిని. ఇంతలో నీకేమిసంకటముకలిగె? ఎవరిబాధ పడలేక విరక్తిఁజెంది ఘోరాటవుల కరిగితివి? అయ్యో! మీసవతితల్లి నిన్నెంతయో ప్రీతితో నాదరించుచుండెనే. నీభార్య ప్రభ నీకేమైనను బోధించుచుండెనే? కారణమైన నెఱింగింపక జనుట న్యాయమా? తండ్రిని నేనుతేనా! పుత్రా, వసంతా, గుణవంతా, నాయెడఁగల భక్తి నేమిచేసితివి? భరింపజాల, రాజ్యము నేలజాల, ప్రాణములఁ బట్టజాల, పుత్రా, పుత్రా, పుత్రా (మూర్ఛిల్లును).

సేవకుడు॥ (ప్రవేశించి) (విసరుచు) మహారాజా! ఆస్థైర్యపడకుము. లెమ్ము.

రాజు॥ (కన్నులదెఱచి) సేవకా! నిజముపలుకుము. యువరాజు, జాబు నెప్పుడు నీ కొసంగెను?

సే॥ మొన్న సాయంతన మైదుఘడియలప్రొద్దుండు సమయమున.

రాజు॥ సర్వాలంకార భూషితుడైయుండెనా?

సే॥ లేదు. సామాన్యునివలె గాన్పించెను.

రాజు॥ ముఖవైఖరి?

సే॥ విచారమున మునిఁగియుండెను.

రాజు॥ నీవేల ప్రశ్నింపలేవు?

సేవ॥ అడిగినటనిగాని మారుమాట పలుకలేను.

రాజు॥ ఏదెసనుండివస్తివి?

సేవ॥ అంతఃపురమునుండియే.

రాజు॥ కపటముగ మాట్లాడిన శిక్షింపెదను. ఎవరి అంతఃపురము?

సేవ॥ (స్వ) ఇప్పుడు నాప్రాణముపోవును. (ప్రకాశముగా) తమయంతఃపురము.

రాజు॥ అనగా,

సేవ॥ అమ్మగారియంతఃపురము.

రాజు॥ ఇక నీవుపొమ్ము. (సేవకుడు నిష్క్రమించును.)

(తెరువంకజూచి) దేవీ! యిటురా.

మదన॥ (ప్రవేశించి) మనోహరా! నమస్కారములు.

రాజు॥ ఈనమస్కారములు కట్టిపెట్టుము. వసంతుని సేసదనమున కేటికిరప్పించితివి?

మదన॥ నాయింటి కతడేలవచ్చును?

రాజు॥ రాకూడదా?

మదన॥ ఎవరువలదనిరి? అతడురాడనియే నేను విచారించుచుందును.

రాజు॥ ఈజాబుచదువుము.

మదన॥ (చదువును)

చ॥ ముదమున తల్లిదండ్రులని • ముద్దులబిడ్డలు భార్యలంచు సం
పదలని యిండ్లుభూములని • భాగ్యము భోగములంచు నెప్పుడున్
తుదగనలేని మాయను, కుతూహలతన్ జరియింపలేక, నే
గెద, గహనాంతరంబుల సుఖింపను మాపతిసేవఁజేయుచున్. 48

ప్రాణనాథా! యిదేటిజాబు? వసంతుడూరలేడా? అయ్యో! అరణ్యావాసము చేయబోయెనా? ఎంతటిదురవస్థ సంభవించినది. ఇక మనమెట్లు బ్రతుకగలము. రాజా! నాకుమారునిగా జూచుచున్నను బరులది లెక్కసేతురే? ఇక నాకేదారి? నాదుర్దశ మెట్లుణగును? రాకుమారుండెందున్నాడు? నాథా! ఆలస్యము పనికిరాదు. ఆలోచించి తగుకార్య మొనరింపవలయు. నేనుబోయి రాకుమారునివెదకి, నగరమునకుఁ గొనివచ్చెదను. ఆజ్ఞయొసంగుడు. అధైర్యపడకుడు. కొంతపడి అంతఃపురమున విశ్రమింపుడు.

(నిష్క్రమింతురు.)

## ద్వితీయాంకము - ద్వితీయాంగము.

### అ డ వి

(ప్రవేశము - వసంతప్రభలు.)

[అ ను బం ధ ము 6.]

వసం॥ సీ॥ మండువేసవి జనులను • మాడ్చునట్లు
మాధవుని యాజ్ఞ కాబోలు • మఱిమఱింత
మంటలును, గాడ్పులును మిన్ను • నంటఁజొచ్చె ;
నార! నిలువఁగ నింతనీ • డయిన లేదె ॥ 49

మనోహరీ!

గీ॥ వలదువలదంచు బహువిధ • ములను, వేఁడు
కొంటి, గహనము దుర్భేద్య • మంటి, ఘోర
భల్లుకమృగాదులకును, ని • వాసమంటి,
దాళలేవంటి, నీబాధఁ • దలచుచుంటి ॥ 50

అయ్యో! సింహశరభశార్దూలాది ఘోరమృగాకులమై, మధ్యందినభాస్కరుని నిండుప్రభలకిరవై, సూదిమొనలవలె పాదములభేదించు కంటకములకు నిలయస్థానమగు నీమహారణ్యమున సంచరింపవలసినదిగా మహాదేవుని సంకల్పము కాబోలును. నేనొంటరినైయున్నచో, విచారమేలేకుండును. ప్రాణేశ్వరీ!

గీ॥ అనుగులకు మడుగులనిచ్చు • పడతులుండఁ,
బిలిచిపిలువక నేవచ్చు • పొలుతులుండ,
కన్నుసన్నల మెలఁగెడి • కాంతలుండ,
సుఖపడఁగలేక యడవులఁ • జొచ్చితబల ॥ 51

దైవబలమున కేమనవచ్చును? కాంతా! నామాటవిని సత్వరమునఁ బుట్టినింటి కైనఁ బొమ్ము. సుఖపడుము. దురవస్థనీకేల?

ప్రభ॥ ప్రాణేశ్వరా!

గీ॥ రాజ్యమునకన్న గహనము • పూజ్యతమము
సఖులకన్నను వృక్షరా • జములు మేలు ;

పతినిసద్భక్తి సేవించు • పతివితకుగాc
గాని సౌఖ్యంబు, దుఃఖంబు • కలుగబోదు ॥ 52

మనోనాథా! భార్య, భర్త కర్థశరీరము కాన నిరువురును నొకప్రదేశమున నుండఁదగుదురు. తమ సాన్నిధ్యముననుండి సేవించుటకన్న, పుట్టినింటమాత్ర మేమి సౌఖ్యముగలదు? ప్రాణేశ్వరా! మీకు విచారమువలదు. ఈగహన మెల్లప్పుడు నిట్లే యుండునా? సంతతము గహనావాసముచేయు మునీశ్వరులుండు స్థావరములెంతైన గాన్పించును. అం దీశ్వరార్చనముల జేయవచ్చును. ఈదారినిబోదము.

వసం॥ ప్రభా! నీకష్టములఁ జూపలేక నేనట్లంటినిగాని, నేనుమాత్రము నిన్ను బాయ గలనా? సంయమివరులుండు స్థలమునకరుగుదము రమ్ము. (రెండడుగులు నడచి) దేవీ! అపరపరమేశ్వరులోయన మహానుభావులీదెసనే వచ్చుచున్నారు. వారి తేజమును గనుము.

గీ॥ చండభానునిబోలి, ప్రచండగతిని
వెలుగుచున్నారు, దేవార్చ•నలను జేసి ;
వారుపూజ్యులు, మనపుణ్య • వశముచేత
వారికిని వారెవచ్చు•చున్నారు చెలియ ॥ 53

యోగి॥ (ప్రవేశించును.)

వసంత, ప్రభలు॥

గీ॥ సకలలోకైకపూజ్యులై • సర్వభోగ
రహితులై, మహాస్థియులై • రంజితచగ
ణారవిందులై మముబోంట్ల • నరయుమీకు
మ్రొక్కుచున్నాము కల్మష • ముక్తులార॥ 54

(ఇరువురు నమస్కరింతురు.)

యోగి॥ దంపతులారా! కళ్యాణమస్తు. మీరీ ఘోరాటవులకు రాగతమేమి?

వసం॥ మహాత్మా! ప్రపంచమున మీ కెఱుంగని విషయములుగలవా? నిర్జనప్రదేశములఁ దామ శివోపాసకులై మనుచుండియూ, దివ్యజ్ఞానప్రభావముచేత సమస్తమును మీరు గనుగొనుచున్నారు. స్వామీ! సత్యముపలికెదను.

ఉ॥ సారవిహీనమై, దురిత•జాల సమన్వితమై, సమస్తను
షాకరణమై, యనిత్యమయి • కామవశీకృతమై, సుపుణ్యసం

హారకన్నె, యధోనముఖ • హానికరంబుఖ, నెయొప్పనిట్టి సం
సారమురంత వేదన, వెసన్ దొలగింపుమ; యుద్ధరింపుమా ॥ ౨౨

యోగి॥ రాజా! ఇంతవిరక్తి నీకుఁ బ్రస్తుతముతగదు. చిరకాలము నిలుపుము. బాల్యమున సుఖక్రీడల నానందించుము, సంతానమునుబడసి, ధర్మమును స్థాపించి, దుష్టులశిక్షించి, శాంతిని దేశముననిలిపి, నీకుమారునకు రాజ్యాభిషేకముచేసి, నీవు మహేశ్వరారాధనమునఁ గాలముఁగడపుట సమంజసము. నామాటవిని దేశమునకుఁబొమ్ము.

చ॥ ఇటువలెఁ గానరాకొమరు • లిమ్ములకాలము బుచ్చుచుంట, మా
కెటులగుశాంతి, దుష్టజను • లెల్లుతొలంగుదు, రంతకాక మా
పటుతర నిష్ఠ లేమగును • భావమునన్ దలపోయుమయ్య, య
క్కటికమఁబూనుమయ్య, సరి • గావుసుమా యటవీనివాసముల్ ॥

ప్రభ॥ సంయమివరా! నమస్కారము చేయుచున్నాను.

గీ॥ సరససద్గుణగణగరి•ష్ఠాప్రశాంత
ఆర్తజనపోషకుండవు, యథార్థవాది
తల్లిదండ్రులు, రాజ్యంబు, • ధనము, భాగ్య
మొల్లకయువచ్చె, మిముఁగొల్చు • చుండభక్తి ॥

కాన మహాదేవార్చనావిధానము నుపదేశించి, తరింపఁజేయుఁడు.

యోగి॥ (స్వగతము) వీరిరువురును సమమగు పట్టుపట్టియున్నారు. నానీతులు వీరికి రుచింపవు. కాన వీరిని సంతసింపజేయుట మంచిది. తగుసమయమరసి వీరిని దేశమునకుఁ బంపుదునుగాక.

(ప్రకాశముగా) మీచిత్తానుసారముగా నాకుటీరముననుండుఁడు. మీకు సర్వ ముపదేశించెదను. (అవనికజారుదు.)

---

ద్వితీయాంకము – తృతీయరంగము.

ప్రవేశము – సేనాధిపతి,

సేనా॥ [అనుబంధము, 7.]

తరల॥ వనులనసుర్లుఁగారగా, వడి•గా, మనోధికలత్వమా
వనితమూపకఁ జూపుచున్ గన•వచ్చెనుచ్చికరాసుతున్

జనని తానని యెంచదో, సుతు • సద్గుణాళిగణింపదో,
మనసుజాఁకదో, పాపమేయుసి • మానియుండదో, చిత్రమా ॥ 58

అబ్బా! నామనో వేదన నెట్లుబాయుదును! కలనైన దేవిగారి నిర్మలాత్మను సంశయింపనుగా. ఇంతమూఢునని భావింపనుగా. అమ్మో! ఈమె కిదేమిదుర్బుద్ధి! సవతి సుతునిపై ద్రోహమెట్లుగోనెను! ఎంతపాపబడెను? యువరాజుగా రీకారణమునఁగాబోలు సతీయుతుఁడై విపినావాసమును గోరియుండుట. రాజ్యమునొల్లకుండుట, ఇందు విచ్చేయుట. ఈకష్టముల బడుచుండుట. బాగుగనేయున్నది. కానిమ్ము చూతము. దైవముగలడు.

ప్రవేశము - సేవకుఁడు.

సేనా॥ సేవకా! వచ్చితివా! వ్యవహారము లెట్లున్నవి?

సేవ॥ ఇట్లున్నవియని జెప్పఁగలనా? తమరాకనెకోరియున్నవి.

సేనా॥ హత్యలిప్పటికిలేవుగదా!

సేవ॥ నేనువచ్చునప్పటికి లేవు. ఇప్పటికేమోగాని స్వామీ!

కం॥ కులమానీచము, వృత్తిని
దలపఁగ నొకసేవకుఁడను • ధర్మాధర్మం
బుల నెఱుఁగను, దేవిగుణం
బులఁగనఁగా, నాకు రోత • పుట్టెనదేమో ॥ 59

కం॥ వలదని మ్రొక్కెను, వందన
ములఁగొనుమను, పాపకార్య • మును నెమ్మదిలోఁ
దలపకుమను, దుష్కీర్తికి
నిలయంబను, రాజసుతుఁడు • నిశ్చలభక్తిన్ ॥ 60

కం॥ ముదమారగ పతిపాదము
లెదలోఁగదియించి, వెంట • నేగినసాధ్విన్
మదనాసతి బలిమిని జం
పుదునంచును ఘోరశపథ • మును దాఁ జేసెన్ ॥ 61

ఇక తమచిత్తము.

సేనా॥ సేవకా! నీసద్గుణములకు మిక్కిలి సంతసించితిని. భయపడకుము. ప్రభాదేవిని నేను రక్షించెదను. (అవనిక ఎత్తబడును.)

(వసంతప్రభలొకవైపునను,మదనమంజరియొకవైపునను నిలిచియుందురు)

ప్రభ॥ (వసంతుని పాదములపైఁబడి) ప్రాణపతీ! నాకు చింత కొంచమైనను లేదు. స్వాంతమంతయు సంతసమున నిండియున్నది.. గౌరీపాదపద్మముల నెప్పుడు సేవింతునాయని త్వరపడుచున్నది. నాథా! త్రికరణశుద్ధిగ మిమ్ము దైవముగా భావించి, సేవించుచుండిన నేను, మీపాదసన్నిధిని జీవములవిడుచుట కెంత పుణ్యముజేసికొంటినో చెప్పజాలను. ఇదిగద సుదినము. నేడు నా నోముఫలము లభించినది. నేను ధన్యురాలనయితిని. మనోహరా! తమరు విచారమునలదు. ధర్మమార్గమును విడువవలదు. మీసవతితల్లిగారిని నిందింప వలదు. ఈయుదంతమునంతయు వెలిబుచ్చవలదు. పాపమెచట జనించు నచటనె నశించును. దైవములేడా! ప్రాణేశ్వరా! ఇది నాకడప్రార్థన.

కం॥ ఇలఁగల సమస్తప్రాణం
బులకు, గలవు రెంటు, పుట్టు•వునుజావును; బే
దలకును రారాజులకును
గలుగునుగా, నొక్క విధము•గా, నిరువురకున్ ॥ 62

కం॥ తనపతి పాదంబుల చెం
తను, జీవంబులను బాయు•తన్వికిపర మే;
గనుక నచంచలభక్తిని
జనియెద, నేనమరలోక • సౌఖ్యములుగనన్ ॥ 63

కం॥ చనవున, చిరసహవాసం
బున, ననురాగమున, గాఢ•మోహంబున, న
వ్వున్, జేసినలోపము
లనఘా! మన్నింపవలయు•నని ప్రార్థింతున్ ॥ 64

[అ ను బం ధ ము 8.]

(ప్రభ, వసంతుని పాదములపైఁబడును.)

వసం॥ అక్కటా! ఇప్పుడు నేనేమిచేయఁగలను? నాప్రాణేశ్వరి నెట్లుబాయగలను? దైవమా! ఇది నాప్రారబ్ధకర్మమా?

కం॥ ఘ్రసిముల, సంతతఃప్రసిముల,
కరుల, హరుల, సిసుల, విడిచి • గహనంబులలో
దిరుగుచునున్నను, నిర్దయఁ
దరుముచు వేటాడవచ్చెఁ • దల్లి; యిరువురన్ ॥ 65

మ॥ వలలోఁజిక్కితి, నెట్టులో గడచిపోవన్ దారి యేలాటిదో
తెలియన్ రాదు, మహావిచార • మెద నుద్దీపించు, నాగోల, నా
చెలి, నాప్రాణపదంబు వహ్నిశిఖలన్ • జెవ్వేదిసుక్కంగఁ గ
న్నులనేఁ జూడఁగలాడనైతి, వెరవెం • దన్ దోఁపదో, దైవమా॥ 66

అమ్మా! మీకుకొంచమైనను జాలిగలుగదా? ఈయమాయకురాలియెడ కరుణ గలుగదా? ఈమహాకార్యము మానగూడదా? అయ్యో! మీకు మేమేమి యపకారమును జేసియున్నాము? తల్లీ! తామొనర్చిన కార్యముగూడదని యటవులకుఁ జేరితిమిగాని, అన్యుల కీయుదంతమును వెలిబుచ్చితిమా? అందున కిదిఫలమా? యోచింపుడు. మన్నింపుడు. మమ్ము రక్షింపుడు.

కం॥ ఇలసద్గుణ నిలయంబై;
పలువురు శ్లాఘించునట్టి • పాత్రంబై; నా
కులసతి రత్నంబై; వ్యా
కులమును దృటినణచునట్టి • కోమలి; జననీ! ॥ 67

గీ॥ తెలిసితెలియని పలుకుల • కలుకఁబూని
యింతనిట్టుల వధియింప • నేలనమ్మ?
ఇంతదుష్కృత్య మొడిగట్టి • తేలనమ్మ?
వందనశతంబు లిపని • వదలికొనుము ॥ 68

తల్లీ! ఇంతకన్న నెక్కుడుగ నేనేమిచెప్పగలను? ఈవిషయము మీనిర్మలాత్మకును దయకును విడిచిపెట్టెదను; తరువాత మాప్రాప్తి. (అని ప్రభనుజూచి)

మనోహారీ! నిన్నువిడనాడి నేనుమాత్రము జీవించియుందునని భావించితివా? సగముదేహము నీయధీనమెగదా! సగము నశించిన మిగతసగము బ్రతుకునా? అయ్యో! ఇంతదురవస్థ మనకేల సంభవించినది?

మద॥ సేనాధిపతీ! చూచుచున్నావేమి? ఈప్రభ నాతనయునిపాలిటె కొకమారిగా జన్మించి, చెడుబుద్ధులఁగఱపి, నగరమున నుండకుండఁగఁజేసి, ఘోరారణ్యములఁ ద్రిప్పుచున్నది. దీని నేమిచేసినను బాపములేదు. చంపుటకాజ్ఞ యిచ్చితిని. వసంతునకెంతచెప్పినను వినకయున్నాడు. అమర్యాదలు తలను బాగుగ వాటినవి. రాజ్యమువలదట. తానురాడట. తంత్రిమాటలను సైతము లక్ష్యముసేయడు. గాన దయనుజూపక వీనినిబంధించి నగరమునకుఁజేర్పుము.

సేనా॥ అమ్మా! ఇంతకఠినము తమకుఁదగునా? ప్రభాదేవిగారిని జంపుటకెట్లాజ్ఞనొసంగితిరి!

మద॥ నాకాపురము చక్కపడవలదా! ఆజ్ఞ యిచ్చితిని. చేసితీరవలెను.

సేనా॥ ప్రభాదేవిగారిని వధించినంతనె, తమకాపురము చక్కపడునని దలంచుచున్నారా!

మద॥ నిక్కముగఁ జక్కపడును. సంశయములేదు.

ద్వి ప ద.

పలుమాటలేలనా - పలుకులఁదోలఁగి
లలననుగావంగ - గలవె? నీ విపుడు.

సేనా॥ పొలతిసద్గుణగణ - ములను బెంపొందె
పలువురు వినినదు - ర్వ్యాపలాడెదరు ॥

మద॥ అదియేల నాసుతు - నడవులజేర్చి
మదిద్రిప్పి రాజ్యర - మను నెడబాపె ॥

సేనా॥ వినజాల నీపల్కు - లనుమానుమమ్మ
వనితలెన్నఁడుభోగ - మునుదూఱవినమె ॥

మద॥ ఇంతలక్ష్యములేక - నెట్లుబల్కితివో
కాంత చేసినపని - కన్నులఁగనవొ ॥

సేనా॥ అంతయుఁదెలిసెనా - కంతయుఁదెలిసె
ఇంతకృత్యంబున - కీవెకారణము ॥ 69

ఉ॥ ఏలవసత్యముల్ పలికెదీవు; నిజంబును దాచిపెట్టి, భూ
పాలకుమారునిన్ గలియఁబాల్పడితయ్యొ; ప్రభాసతీమణిన్

జాలియొకింతయున్నకఁ ✦ జంపఁగ నెంచితి వెంత పాపివిరా?
ఏలదలంకవో? యశము ✦ నెంచవో? కీడుల పాటిసేయవిరా? 70

సీ॥ నరపతికిది తెలిసిన నీ
శిరమును ఖండించు నిట్టి ✦ చేష్టలు తగునా?
తరుణీ! సవతికుమారుని
వరియించుట చేతవచ్చు ✦ పాతకమిదియే ॥ 71

మద॥ (స్వగతము) అక్కటా! మోసమువచ్చె? సేనాధిపతికి సర్వమును దెలిసె. ఇక నా మానమునిలువదు. నేనేమిచేయుదును? ఎట్లు తప్పించుకొనగలను? (ఆలోచించి) ఈసేనాధిపతిని స్వాధీనము జేసికొనుటయె తగుసాధనము.

(ప్రకాశముగ) సేనాధిపతీ! తెలిసి తెలియని మాటలాడెద వేమి? నీకిది తగునా? విషయమంతయు నీకు దెలుపకయుందునా? త్వరపడెద వేల? ఇటురమ్ము.

(సేనాధిపతియు మదనయు నిష్క్రమించుదురు.)

(స్వగతము)

సేనా॥ (మరల ప్రవేశించి) ఆహా! స్త్రీస్వభావ మెంతనీచమైనది?

కం॥ కనుగొంటి నంచు నంతయు,
వనితామణి వెఱచి, బయలు ✦ పడకుండఁగ, నా
ధనమును దృటిలోఁ గనుఁగొని
"నినుఁగోరితి, ప్రియుడవింక ✦ నీవే" అనియెఁ ॥ 72

ఇక నాకేదిదారి? ఎందుబోదును? ఈగ్రహము నన్ను బట్టినదేమి! అంగీకరించుట మహాపాతకముగదా? సమ్మతింపకున్న, వసంతునిగతియె నాకునుబట్టును. అయ్యో! నిజస్థితి నేల చెప్పితిని? ఎంత వెఱ్ఱినైతిని! కానిమ్ము చూతము.

(ప్రకాశముగ) వసంతరాజా! మీతండ్రిగారి ఆజ్ఞల బాటిసేయరా?

వసం॥ జనకునిమాటల దాటుదునా?

సేనా॥ అయిన నగరమున కేలరాగూడదు? తండ్రిగారు వృద్ధులని తమకెఱుఁగరా? ఇంత అన్యాయమా?

కం॥ జనకుండు వృద్ధుడని మీ
మనసునకే తెలియు, నతని మాటలవిని, నా
మనవినిగైకొని రాజ్యము
గనుఁగొనగౌరవమ్ము, సుఖముఁ గాంచెదవిటుపై ॥ 73

ఇంక కొన్ని విషయములను జెప్పెదను. ఇటురండు.

(ఇరువురు నిష్క్రమించుదురు.)

(అవనికజారును.)



# వసంతప్రభ.

---

## తృతీయాంకము - ప్రథమరంగము.

చతురిక ప్రవేశించును.

[అనుబంధము 9.]

చతు॥ సీ॥ వలదని పలుమారు • పలికినవినక, రా
పట్టినిగాఁగిటఁ • బట్టనెంచి;
ఆతండువినక ని • రాదరించివాని
గానలకంపించి • గాసిపెట్టి
మరలనాతనిబట్టి • పురమునకును దెచ్చి
వానిపత్నిని నెపఁ • బాయఁ జేసి;
తుదకు సేనాపతి • తోడ సంభోగించి
కులమపకీర్తిలో • నిలుపనెంచి;
గీ॥ ఔర! రాజును దుష్కీర్తి • నణపఁజొచ్చి,
నీచులకు మానసంబిచ్చి • నీతిమాలి
రాచవారిని దుర్యశో • రాశియందు
ముంచుచున్నది, దుర్మోహ • మునలతాంగి ॥ 74

కట్టా! మాకు అంతఃపురపరిచారికలకు కీడు నిజముగ సంప్రాప్తించనున్నది. నిర్భయమున సేనాధిపతినిగూడి విహరించుచున్నది. సర్వకాల సర్వావస్థలయందును, వాడిల్లుబాసి వెడలకున్నాడు. వానికుపచారముఁజేయలేక మాపని విషమావస్థను దిగినది.

చ॥ వలదనిబల్కరా దదియ • పాయము; రాజును జేరి, యున్న వా
ర్తలనెఱింగింపఁ రాదతఁడు • దారుణభంగిని శిక్షఁజేయుఁ; న
న్వలగతియేమొ; యింతసదు • పాయము దోచదు కాంతలెల్లరుం
దలకుచునున్నవారలు, స • దాశివుఁగొల్చుచు సౌధసీమలన్ ॥

రాజ్యవినాశమునకుఁ గాలము సంభవించినది. గొప్పమార్పులు రానున్నది. హత్యలు ప్రారంభింపనున్నవి. దేశ మల్లకల్లోలముగానున్నది. రాజు శాంతమూర్తి, సత్యస్వరూపుఁడు. యుదారగుణభూషణుఁడు. అయ్యో! పాపము. ఇంకను దేవిగారియెడఁగల యనురాగమును విడువకున్నాడు. కలుషమును గనుఁగొనలేకయున్నాడు. సన్మానించుచున్నాడు. రాజా! మేలుకొనుము.

(అని ఆలోచననభినయించును.)

సేవకుడు॥ (ప్రవేశించి)

చ॥ ఇదిసరికాని కార్యమని యెంతఁగఁ బల్కిన నూనకుండె, నీ
యధమమును, రాజపత్నిగలియఁగ మదినెంచెను, గష్టసాధ్య మి
య్యది తగదంచు నెంచడకటా! చెడుగల్గెడివేళకిట్టి దు
ర్వ్యథలనఁగల్గనౌనొకొ, యుపాయముదోపదు వీనినెమ్మదిన్ ॥ 76

చ॥ సరసులు లేరొ? పల్వురిలఁ జాణలుగా రమియించునట్టి సుం
దరులరుదైరొ? వారిని ముదంబునఁ గూడిసుఖింపరాదొ! ఈ
శ్వరసముఁడైన రాజుచెలిపై ననురాగమునిల్ప పాపసం
భరితము రాజధర్మ సమవస్థిత యాతనదానెఱుంగడో ॥ 77

ఉ॥ ఈవిరిబోణి భూవరునకెంతయు నెయ్యపుటాలటంచు, న
చ్చో వెరపొందఁబోలునరుచున్, గనడా చెడుగుల్ ఘటిల్లఁగాఁ
బోవునటంచు నెంచడో గుభిల్లనదో మదిలో వినాశకా
లేవిపరీతబుద్ధి యనులీలఁదమిన్ జెయివట్టెరా చెలిన్ ॥ 78

చిన్ననాటనుండియు రాజనగరులఁ బెరిగి, వారివస్త్రమునుగట్టి, వారియన్నమును దిని, సేవకావృత్తినుండి, సర్దారుఁడై, సేనాధిపతియై, కృతజ్ఞతఁ జూపవలసిన ఈమదాంధుఁడు, కృతఘ్నుఁడై రాజుగారి ధర్మసతిని గూడుచుండుట, యెంతటివిచారము, ఎంతటిపరితాపము! ఔరా! వలదని బోధించిన నామాటవినక, మదనాంతఃపురమును క్షణమైన విడువఁజాలక, రేయింబవళ్లందే వాసముచేయు వీని నేభూతమైన నాశము చేయదేల? ముక్కలుగ ఖండించి కుక్కలకు వేయదేల? అయ్యో! నాకడుపుమంట చల్లారుటెట్లు? వానిని నాశనముఁజేయుటెట్లు? నారాజుగారికి సాయముఁజేయుటెట్లు? ఆజన్మాంతము శాశ్వతమపకీర్తిలో మునుఁగనున్న రాజుగారి వంశమును గాపాడుటెట్లు?

అక్కటా! దేవిగారి కీదుస్థితి కలిగినదేమి? వంశగౌరవము పాటింపవో! వాడు నీమఁ
పసి గుర్తెఱుఁగదో! కఠినశాసనము తన ప్రాణములఁ దీయునని భయంపడవో?

అయ్యో! ఇంతదుఃఖమున నేనెట్లు బ్రతుకఁగలను ?

సీ॥ ఒకవంక నెలరాల • నుండిజారెడిసిరి
తుంపురల్ మైకాకిఁ • దొలఁగఁ జేయ
ఒకచాయఁ బలుకల • యికలు రానన విల్లు
చదువులఁ జలుకలు • సదువుచుండ,
ఒకజాడ రేయెండ • యోయనడాల్ జిమ్ము
మెఱుపుదివ్వెలు సిగ్గుఁ • బెంచుచుండ
నొకచోటఁ జేరాస • లొందిమేఁబుడికి యు
వ్విళ్లూరఁ జెమ్మెల్ • వీచుచుండ
తే.గీ॥ తావి వెదజల్లు విరులునం • తటను బర్వఁ
బొన్నపైసామితోఁ గేలిఁ • బడయకిటుల
మాయగానికిఁ గన్నార్తి • మనసు నిచ్చి
నహహ నమ్మఁగ రాముపో • యామువాంఛ ॥ 79

(అటునిటుచూచి) చతురికా! ఇచ్చటి కేలవచ్చితివి?

చతు॥ రావలసియే వచ్చితిని.

సేవ॥ అనఁగా,

చతు॥ ప్రబల హత్యలు జరుగనున్నవి. మగవారిసాయముఁగోరి వచ్చితిని.

సేవ॥ నిశ్చయముగ నేను సాయము చేసెదను రమ్ము.

చతు॥ నీవు మగవాడవై నగద?

సేవ॥ ఇదేల? ఇట్లనుచున్నావు.

చతు॥ ఇందున నేమియాశ్చర్యము?

చ॥ అరయక దుర్మదాంధులు దు • రంతముగాఁ బెరవారిఁగండకా
వరమునఁగూడుచున్నఁ దగు • వారలు వారలఁగ త్తివేటులన్
అరిమురిసేయుటొప్పుఁ దగు • నా మగవాడనటంచుఁ జెప్పిసుం
దరివలెగాజులన్ దొడగి • నాడవు సాహసమెందుబోయెనో ॥ 80

సేవ॥ ప్రేయసీ! నిజమాడితివి.

గీ॥ ముద్దుగుమ్మయటంచును • ముద్దయనుచుఁ
తెలియ నిన్నింతదనుక నేఁ • దలఁచుచుంటి
ఇప్పుడో ఇంతసాహస • మింత ధైర్య
మింతధర్మువుగల • దాన నెఱిఁగికొంటి ॥ 81

చతు॥ ప్రాణేశ్వరా! ఈసమయము విలువలేనిది. చంద్రహాసునిచావు సిద్ధముగానున్నది. కానవైలము,

మ॥ అసిచేఁబూని మహాగ్రధారలను శౌ • ర్యంబెల్ల భూభర్తకున్
వెసఁజూపింపఁగ సైన్యనాథునితలన్ • వ్రేయంగ, ధర్మంబు, దా
న, శమించున్ దురితంబులెల్లెడల, న • న్యాయంబు క్షీణించు, నీ
యశముల్ లోకములోన వాకొనుదురెం • తైనన్ మనోవల్లభా ॥ 82

పోదమురండు.

(నిష్క్రమించుదురు.)

---

## తృతీయాంకము - తృతీయరంగము.

### మదనాంతఃపురము.

—[ వెలుపలిభాగము. ]—

(సేవకుఁడు నిలువంబడియుండును.)

సేవ॥ ఔరా! కాలమహిమ.

గీ॥ ధర్మమణఁగెను; నచట న • ధర్మముండె;
సత్యమణగెను; నచట న • సత్యముండె;
జారచోరత్వములకు నా • ధారమయ్యె
నౌర! కలికాల మహిమనే • మనితలంతు ॥ 83

గీ॥ సజ్జనులకెల్లెడల మన • స్తాపములును
నీతిరహితులకెందును • నెయ్యములను

రాజహంతకులకుఁ గొప్ప • రాజ్యములును
నారా! కలికాల మహిమనే • మనితలంతు ॥ 84

జగద్రక్షకా! నాపనోద్ధైర్యమును నీవెఱింగియేయున్నావు.

సీ॥ ఇంటఁదిని, యింటివాసము • లెంచలేక,
కౄరకృత్యంబుఁ గనలేక • ఘోరమణప,
నిలిచియున్నాఁడ! నాప్రాణ•ముల నొసంగ,
చిట్టచివరకుబోరాడు • చింతతోడ ॥ 85

ఏమహారాజునాశ్రయించి పేదరికము నెఱుంగక సుఖించుచుంటినో, ఏధర్మప్రభుని సాహసపరాక్రమములు రిపురాజులగుండెలు బ్రద్దలుచేయునో, ఏప్రభువర్యుని సన్మార్గప్రవర్తనము దీనుల కాధారభూతమయ్యెనో, ఏరాజు సత్యదీక్షానువర్తనుఁడో, ఆతనికి సుఖమగుగాక, దురితములు దూరము లగుగాక, జయంబగుగాక.—

(చంద్రహాసుఁడు ప్రవేశించి లోనికిబోవుచుండును.)

సేవ॥ రాజకుమారా! నిలువుము. లోనికిఁబోవలదు.

చంద్ర॥ ఏమిరా! అడ్డుపెట్టెదవు. మా అమ్మనుజూడవలెను.

సేవ॥ ఇది సమయముకాదు.

చంద్ర॥ నీకేమి వెఱ్ఱియెత్తినదియా! అమ్మగారి సౌధనమునకుఁ బోవుటకాజ్ఞయా?

సేవ॥ దేవరా! మన్నింపుడు. ఇపుడువలదు.

చంద్ర॥ ఇదేమివిపరీతము? సేవకా! నన్నుపోనిమ్మా! అమ్మగారి నొకవిషయమడుగఁ దలచి పోవుచున్నాను.

సేవ॥ తండ్రీ! ఆవిషయము నాకుఁదెలుపరాదా? నీసంశయము నేనుదీర్చెదను.

చంద్ర॥ నీకుఁ దెలుపరాదు.

(స్వగతము)

ఆ-వె॥ తోడిబాలురెల్ల • తోచినట్లుగ హేళ
నంబుఁ జేయనికమ•నంగఁజాల;
నమ్మతోడ చెప్పి • నెమ్మదిఁగననుంటి,
నారి! లోనికేగ • నడ్డుపెట్టె ॥ 86

(ప్రకాశముగా) సేవకా! నేను పోయితీరవలెను. అడ్డుపెట్టకుము.

సేవ॥ రాజా ! నీమేలుఁగోరి వేడుకొనుచున్నను. గ్రహింపవైతివి. ఈఖడ్గముచే నా శిరము ఖండింపుము. వెనుకఁబోము.

చంద్ర॥ సేవకా ! నీవు మంచివాడవు. సర్వేశ్వరమున కొరణమెఱింగింపుము. నాకు మతింత భయమగుచున్నది.

ఆ-వె॥ జనని సౌధమునకుఁ • జనిసఁ దప్పేమయ్య,
ఆత్మజుండఁగానె • అమ్మగాదె
భేదమేమిమాకు • భేదముగల్పింపఁ
దలఁచితీవు, నీకుఁ•దగదు సుమ్మ ॥ 87

సేవ॥ అయ్యా ! అంతఃపురవార్తలు దుర్వార్తలుగానున్నవి. సేనాధిపతి సదా నగరుల నివాసము చేయుచున్నాడు. నిజానిజములు భగవంతునకెఱుక. తరువాత తమదయ.

ఆ-గీ॥ ఇన్నినాళ్లుగనితి • నీరాజ్యమునునేను
వినను, గనను, నేటి•వింత, లెపుడు
అకట, రాకుమార ! • హత్యలుజరుగఁగా
నున్నవనుచు, భయము•నొందుచుంటి ॥ 88

చంద్ర॥ సేవకా ! బాలురెల్లరును హేళనము జేయుచున్నారు. నాహృదయాందోళనము పరమేశ్వరునకే తెలియును.

మత్త॥ అమ్మ నీచునిగూడునా? విని, • యంతరాత్మనదెట్లు నే
నమ్మవచ్చును ? తోడిబాలురు • నన్ను హేళనచేయఁగా ;
సేవ॥ నిమ్మలక్ష సరఁకూరుఁడిందుల • నేలవాసముఁ జేసెమీ
యమ్మతో సరసంబులాడఁగ • నౌనొ ! లోకముమెచ్చునో !॥89

చంద్ర॥ సేవకా! నీవెందేని దాగియుండుము. నేను పోయెదను. ఆలస్యము చేయఁదగదు.

గీ॥ జననమొందితి రారాజు • తనయుఁడనయి
చేతబట్టితి ఖడ్గంబు • చింతయేల ?

పాపము హరింపఁజేతు, నా • ప్రాణమైన
విడుతు ; క్షత్రియగోత్రంబు • విడువనొల్ల ॥ 90

(నిష్క్రమించును.)

(అవనిక యెత్తబడును.)

(చంద్రహాసుఁ డొకవైపునను, మదన సేనాధిపతియు మఱియొకవైపునను నుందురు.)

చంద్ర॥ ఏమిరా ! నీచా! నీవిక్కడికేలవచ్చితివి ?

సేనా॥ మీ అమ్మనడుగుము.

చంద్ర॥ తల్లీ ! వీని నేలఁ బిలిపించితివి ?

మద॥ కుమారా ! శాంతింపుము. కూర్చుండుము.

చంద్ర॥ ఇప్పుడీ మన్ననలుపనికిరావు. వీని నేల పిలిపించితివో మొదట చెప్పుము.

మద॥ అతఁడు సేనాధిపతిగాఁడా ? పనిగలిగియే వచ్చెను.

చంద్ర॥ రాజుతో నతనికి పనియుండునుగాక. నీతో నేమిపనికలిగె ?

మద॥ తరువాత చెప్పెదను.

చంద్ర॥ అమ్మా ! అట్లుకాదు. ఇప్పుడే చెప్పవలెను.

మద॥ నాయనా ! త్వరపడవలదు. నీకు చెప్పకపోదునా ?

చంద్ర॥ నీచుని సాంగత్యమువలన దుర్యశము చేకూరునని నీకుఁ దెలియదా? అందున వీడు దుర్మార్గుఁడు. స్వామిద్రోహి. చండాలుఁడు. ఇట్టి అధమాధముఁడు నీకు ప్రియుఁడాయెనా ? నిజముపలుకుము. అబద్ధమాడకుము. వీడేలవచ్చెనో చెప్పుము.

గీ॥ సందుగొందులజనులు ని • శ్శంకముగను
బలుకువార్తలు చెవులకు • ములుకులయ్యె
ఇట్టివానికి చనవిచ్చు • టెంతహాని ;
ఎంచవైతివి, మనకీర్తి • నింతయైన ॥ 91

అయ్యో ! అమ్మా! వీనిని చూడఁజూడ దేహమున మంటలధికమగుచున్నవి. మా కొంపగాల్ప నెంచితివా ?

గీ॥ ఇంతపేరు ప్రతిష్ఠలో • నింతవరకు
కాలమునుదోయుచున్నాము ; • గాని నీవు

అకుగు పెట్టికులంబు లక్షయంబుఁజేయ,
నెంచుచున్నావు; దుష్కీర్తిఁ ముంచినావు ॥ 92

మదన॥ తండ్రీ! తొందరపడకు. తొందరపడకు. నేనుజెప్పెదను. లోనికిరమ్ము.

(ఇరువురు నిష్క్రమించుదురు.)

(మరల ప్రవేశించుదురు.)

చంద్ర॥ ద్విపద.

అమ్మ నీవాక్యము - లతివిచిత్రములు,
సమ్మతింపఁగఁజాల - సుమ్మయేమైన;
మద॥ తనయనీ విటులాడఁ - దగదునామాట
వినినన్ను మన్నింప - విన్నవించెదను;
చంద్ర॥ తల్లి! నీచునిపొందు - తగదుదుర్వార్త
లెల్లలోకమునిండె - నేమందునకట;
మద॥ వానినేవిడనాడ - బ్రతుకంగలేను
నానోముఫలమయ్యె - నన్నింతచేసె.
చంద్ర॥ రారాజునకుబుట్టి - రమణియీఖలుని
పీరత్వమునకునే - వెన్కకేగుదునె?
సేనా॥ వెనుకకుబోకున్న - వ్రేటుచేనిన్ను
బనుపుదుగాకనీ - బాబునుజూడ.
చంద్ర॥ ఏమిరాదుర్మార్గ - యింతపేలెదవు,
నీమరణమునేడు - నిక్కముసుమ్ము.
మద॥ హా! మనోహర! పీని - నదలింపఁబోకు,
నాముద్దుబిడ్డఁడు - నామాటవినును.
చంద్ర॥ నాతండ్రికీవార్త - నయమునఁదెలిపి
నీతలనఱికింతు - నింతనిజంబు ॥ 93

సేనా॥ మదనా! దీర్ఘాలోచనఁజేయుము.

మ॥ ఘనరోషంబున వీఁడు రాజకడ కేఁగంగా వచ్చు ; నివ్వార్తలా
తనికిఁ జెప్పఁగవచ్చు, నంతటను నా•తం డుగ్రుండై జీవముల్
గొనవచ్చుఁ, జెడువచ్చు, నాపదలునీ • కుఁ నాకు సంప్రాప్తమౌఁ
గనుకన్ వీఁడు సుతుండటంచు విడువం•గారాదు సుమ్మిప్పుడున్ ॥ 94

పద॥ అయ్యయ్యో ! సేనాధిపతీ ! ఎంతమాటాడితివి ? వీఁడు నాకన్నకుమారుఁడే, కరుణాకరహృదయుఁడే, సుందరాంగుఁడే, చిన్నిపాపఁడే, వీనినిచంపుటకు నేను సమ్మతించెదనా ? అట్లైన నాప్రాణములుండునా ?

చ॥ కడుపున మోసిమోసి, కడు•కష్టములంబడి దైవసత్కృపం
బడసిన చిన్నిపాపని, య•మాయకు నెట్టులఁ జంపుమందు, నా
కడుపు వినాశమొందిన, సు•ఖంబులు నాకవి యేల, ప్రాణము
ల్విడుతును గాని పుత్రునవ•శీలవధింపఁగ సమ్మతింతునే? ॥ 95

చంద్ర॥ అమ్మా ! ఇప్పుడైనను వీని దుస్స్వభావము నీకుఁ దెలిసెనా ?

కం॥ మనయింటఁ బెరిగి పోయిగ ;
ననుఁ దాఁ జంపునట, వీని•నమ్మఁగఁదగునే !
ననుగాదు నిన్ను సైతముఁ
దనకత్తికి బలిగనిచ్చు • దయమాలి, తుదన్ ॥ 96

మదన॥ పుత్రకా ! భయంపడకుము. నిన్నితఁడు వధింపఁడు. నామాటవినవా ? నా మానముఁ గాపాడవా ? నేను తల్లినిగానా ? నాతప్పులను నీవు మన్నింప కున్న నెవరు మన్నింతురు ? నాయనా !

సీ॥ కడుకష్టములకోర్చి • కడుపున నవమాస
ములు భరించితినిన్ను • ముద్దుబిడ్డ
నిను బెంచుటకుఁ గాను • నిత్యపథ్యంబులఁ
జేసి పోషించితిఁ • జన్నితండ్రి

నీసద్గుణంబులు • నీదివ్యరూపంబుఁ
గనిసంతసించితిఁ • గన్నపుత్ర
నినుజూడకయ నేను • నిముసమైనను మన
లేక వేసరితిని • నాకుమార

గీ॥ నామనుంగడ, నాయాస • నాసుఖంబ,
జీవములు సర్వమునునీవె • చిన్నికుఱ్ఱ;
నన్ను మన్నించి, ప్రేమించి • నామొరాల
కించి, నాలోపములను క్షమించుము, తండ్రి ॥ 97

నేనా॥ కోమలీ! బుద్ధిహీనుఁడనై, నీమాటలనమ్మి, నీమోహము నిజమనుకొని, నన్ను బరమానందమున ముంచుదువని నమ్మితిని. నేనుచేసినపనికి నేనే నిందితుఁడను. పదివేల నమస్కారములు.

చ॥ తెలివియొకింత లేక, కడుఁ • దియ్యని పల్కులకే నునమ్మి; నీ
వలపు నిజంబటంచు, నను • బాయవటంచును, నిశ్చలాత్మతో
గలియుదువంచు నాకిఁక సు • ఖంబెయటంచును జింతఁజేసితిన్
నలినదళాక్షి! కాలసద • నంబున కేగెదనిప్పుడే సుమా ॥ 98

నీవు నీకొడుకును జంపుకొనకుము. నన్ను జంపింపుము. దాన నీకేమికొఱఁత? నీకు నేనుగాకున్న వేఱొకఁడగును. ఇన్నిమాటలు నాకేల. ఈకత్తిచే నీవే నాతలనరుకుము.

(అని సాగిలబడును.)

మదన॥ మనోహరా! లెమ్ము లెమ్ము. నీకు నాప్రాణమిచ్చెదను. నీకొఱకై నాప్రాణము నర్పించెదను. భయఁపడకుము. వీనినిఁక భయముచే స్వాధీనము చేసుకొనఁ జూచెదను. అప్పుడును మూర్ఖముపట్టిన, నీస్వాధీనము చేసెదను. కొంత తాళుము. నామాటనమ్ముము.

చ॥ నినువిడనాడఁ జాలుదునె? • నీవుప్రియుండవు; నన్నుఁ బ్రోచుస
జ్జనుఁడవు; ప్రాణమిత్రుఁడవు; • శాశ్వతసౌఖ్యము నిచ్చుభర్తవున్
తనయునిమీఁద ప్రేమనిక • దప్పితి, కోపముచేతలొంగునా
యనిపరికించుదాన, వినఁ • డా? వినకున్ననుజంపువైలమే ॥ 99

(అనుచు కుమారునివంకఁదిరిగి)

ఏమిరా! ఈయుదంతమన్యులకుఁ దెలుపక, రహస్యముగా నుండవలెను. నయమున నిన్ను బతిమాలితిని. ప్రార్థించితిని. క్షమించుమంటిని. నీవు నాసుతుండవని తలంచి మాట్లాడకుము. నీవు నాకుశత్రుండవైతివి. నాప్రాణములం దీయనున్నావు. ఇంకదయ లేదు. జాలిలేదు. సంతాపములేదు. పుత్రవాత్సల్యములేదు. ఏమియునులేదు. సాహసము, తెగువ, క్షాత్రము, నన్నావరించినవి.

గీ॥ ఇంతదనుకను హితబోధ • లెంతయేని
చేసితినిగాని నామాట • చెవినిబెట్ట
కున్నవాడవు, ప్రాణము • లున్నవరకు
వీని, నావిభు, నెడబాయ • లేనునిజము ॥ 100

గీ॥ సమ్మతించితివేని శా • శ్వతసుఖంబుఁ
బడయనున్నావు, సత్కీర్తిఁ • బడయఁగలవు
మాటవినకుంటివా, దయ • మాలినిన్ను
జంపనున్నాము, నేడు, ని • స్సంశయముగ ॥ 101

చంద్ర॥ (స్వగతము)
దైవమా! సర్వమును వినుచున్నావు కదా.

మ॥ జననంబొందెను రాజవంశమున, స్వ • చ్ఛంబైన సద్గౌరవం
బునుగాంచెన్ సురనాథుబోలినవిభున్ • బొందెన్, యశోధాముఁడై
కనె నన్నున్ గడకట్టెనీచతమునిన్ • గామించిమర్యాదలే
కను మావంశము రూపుమాపదలఁచెన్ • గాబోలు భోగేచ్ఛయై ॥

చ॥ పొలతుల కీవికారములు • పుట్టుకతోడనె పుట్టుఁగాన, నీ
తులు పదివేలుచెప్పిన, మతుల్ సరిగావటి, యెట్లటన్న, బె
బ్బులినిఁగొబ్బిరిచ్చి కను • బోషణచేసిన, వానినెప్పుడో
తలదిగమ్రింగి చంపుటకుఁ • దామదినెంచదె, నైజబుద్ధిచే ॥ 103

పుత్రుండననియైన విచారింపక, తల్లి మోహావేశముచే నీచునివిడనాడలేక, నన్ను వధించునని పలుకుచున్నది. రాజవంశమున జన్మించి, దుష్కీర్తిలో మనుటకన్న, ప్రాణ

ములఁ బాయుటయే పరమధర్మము. సకలజీవులును ఎప్పుడయినఁ జావవలసినదేగదా! అందులకు భయఁపడను. గాని రాజ్యమిక పొందనున్న చెడుపేరునకు విచారించుచున్నాను.

దీనరక్షకా! ఆపద్బాంధవా!

గీ॥ కలుషమెఱుఁగనినన్ను వీరలువధింప
నున్నవారలు, సిద్ధమైయున్నవారు
ప్రాణములఁబాసి నీపాదపద్మములను
గొలుచుచుండెద నిర్మలగుణముతోడ ॥ 104

(ప్రకాశముగా) తల్లీ!

గీ॥ నీకుఁబుట్టిన దుర్బుద్ధి నిన్నెయణచు
కడకు నీమానమునువీడు గావఁబోడు
నీచవృత్తినివీని సాన్నిధ్యమందు
గొలువనున్నావు, దుష్కర్మఫలముచేత ॥ 105

కం॥ ననునఱుకుము, కాల్చుము, నీ
మనవిని, వినఁజాల, ధర్మమార్గమువిడువన్,
జనియెద, హాయిగ, నిశ్చిం
తను, శంభునిగొల్వఁగా, ముదంబున, నేఁడే ॥ 106

నీపనిఁగానిమ్ము.

తండ్రీ! పార్వతీరమణా! ఇది నాకడమొఱ్ఱ.

ఉ॥ జనకుఁడు శుద్ధమానసుఁడు సజ్జనుఁడార్యనుతుండు, శాంతుఁడా
తనినెటుగాచెదో, కులము దారుణదుస్థితిచేత నంత్యమొం
దును గదమెట్లుకాచెదవొ దుష్టులనెట్టుల సంహరించి స
జ్జనులను బ్రోచెదో, ధరన శాంతిని నెట్లణగించెదో, శివా ॥ 107

తరల॥ సకలజీవుల కెందుఁదప్పదు చావుపుట్టుకతోడనే;
అకటనామది కింతయేని, భయంబుగల్గదుగానమి

మ్మికను నిశ్చలభక్తితో భజియించెదఁ బరమాత్మ! నా
సకలపాపములఁ హరించి యశంబునిల్పుమ, కావుమా॥ 108

(చేతులను జోడించి కన్నులుమూసికొని)

ఆ-వె॥ శ్రీమహేశ! శంభొ శ్రీపార్వతీనాథ!
సకలలోకభర్త! సాధుమిత్ర!
ఫాలనేత్ర! సుజన పాలనకర్త! శ్రీ
శంకరా! మహాత్మ! శరణు, శరణు ॥ 109

(సేనాధిపతి, చంద్రహాసుని బలవంతముగ బట్టుకొని లోనికిపోవును.)

(అవనిక జారును.)



# వసంత ప్రభ.

## చతుర్థాంకము - ప్రథమరంగము.

(వసంతుఁడు దైవప్రార్థన చేయుచుండును.)

వసం॥ [అనుబంధము 10.]

ఉ॥ సనకసనందనాది, ముని♦సత్తము లెవ్వని పాదధూళిఁదా
మనయముఁగోరి, భక్తిమెయి♦నాత్మఁ భజింతురు; సర్వజీవరా
శినిభరియించి, దుష్టులకు ♦ శిక్షకుఁడై, ఘనుఁడై, మహాత్ముఁడై
మునిజనసేవితుండయిన ♦ పూజ్యునినాతని సంస్మరించెదన్ ॥ 110

మ॥ కరుణాసింధువు, సద్గుణాన్వితుఁడు, లో♦కంబేలుసర్వాధికుం
డరవిందాక్షుఁ డనంతుఁడవ్యయుఁడు, మా♦రాకారుఁడత్యంతదు
ర్భరదారిద్ర్యదవానలాంతకుఁడు, శ్రీ♦రామార్చితుం డాద్యుఁడి
ద్ధర మన్మోహముసంహరించి, సదయా♦త్మన్ గావఁగా మ్రొక్కెదన్

ఏమహాత్ముఁడుసృష్టి, స్థితి, లయాదుల కాధారభూతుఁడో,
ఏపవిత్రుని నామోచ్చారణ మెంతటిపాపములనైన వినాశముసేయునో,
ఏపరమాత్మ దీనార్తిభంజనుఁడో, దయార్ద్రస్వభావుఁడో, సజ్జనరక్షకుఁడో,
సర్వదురితసంహారకుఁడో, వానినాశ్రయించెదను. ప్రార్థించెదను. దృఢభక్తిని
సేవించెదను.

తండ్రీ! ప్రపంచమంతయును నీస్వాధీనమైయున్నది. నీయాజ్ఞల కెదురుచూచుచున్నది. నీవు దయామయుఁడవు. నిన్ను సేవించువారల కెన్నటికి పాపములంటవు. నిత్యానందమునను దురు.

కాని దేవా!

గీ॥ కష్టములకోర్చి, నావెంట ♦ గహనములకు
నడచి సకలోపచారము ♦ లెడ తెగకను

జేయుచుండిన ప్రభ నేమి, చేసితయ్యొ;
బ్రతికియున్నదో! విడిచెనొ! ప్రాణములను ॥ 112

గీ॥ వలదువలదంచుఁ బలుమారు పలికియుంటి
నడవులను గడుఁగష్టముల్ బడుమవంటి,
వెంటరావలదంటి, నే వేడుకొంటి,
హాయిగానుంటి, నీగతి నరయకుంటి ॥ 113

సీ॥ కళ్యాణి నావెంటఁ గానన సీమల
కరుదెంచె; సత్కృప నరయరయ్యా;
మోహనాకార, ప్రమోద మొందుచుఁబతి
భక్తిని, విడమగాఁ బాడరయ్యా;
తోడినెచ్చెలుల, బంధువులను, బాటింప
కేతెంచె, దయను, లోనెంచరయ్యా;
కీరవాణినట, ముక్కిడిధాత, యుంచెనె
ట్టుల, నున్నదో, నాకుఁ, దెలుపరయ్యా;
గీ॥ కానడాయెనె, సద్గుణ గరిమనైన
మాలవిధి, మమ్మునిబ్భంగి మాడ్చెనయ్యా,
మీరావరాళిని ప్రేయసిఁ గావరయ్యా,
సూర్యచంద్రాది దేవతాచార్యులార! ॥ 114

అక్కటా! ఈవిచారము, పరితాపము, సంకటము నన్నాజన్మాంతమును విడనాడవుగాఁబోలును. వలదు వలదన్న వెంటవచ్చి, భక్తి విశ్వాసములతో సకలోపచారములఁజేయుచు, నన్ను నిముసమైనఁబాయని నాయర్ధాంగలక్ష్మిని గహనముల విడనాడి వచ్చిన మహాకఠినాత్ముఁడను, క్రూరుఁడను, దుర్మార్గుఁడను, అయ్యో! ఆమనోహరాకారము కరువుదీరఁ జూడగలభాగ్యము నాకుఁగలదో, లేదో, మనోహరీ! ఆపాపాత్ములు నిన్నువధింపుఁడని ఘటులకాజ్ఞాపించినప్పుడు, వెఱవక, భయపడక, విచారమొందక, నాపాదములంబడి "నాథా! దివికేగి పరమేశ్వరుని సన్నిధానమునుండెదను. మీరు

ధర్మమార్గమును విడువకుం” డని. నాకు ధైర్యముఁ గలిగింపలేదా! అడవుల నన్నుఁబాసి నివాసమెట్లు చేయఁగలిఁగితివి? ప్రాణమెట్లుఁబుచ్చుచుంటివి? నిన్నోదార్చువార లెవరు? నీభయముఁదీర్చి రక్షించువార లెవరు?

కోమలీ! మనోహారీ, ప్రాణేశ్వరీ, ప్రభా, (అని మూర్ఛిల్లును)

సన్యాసి॥ (ప్రవేశించి) రాజా! లెమ్ము లెమ్ము. ఇంతవిచారమేల పడుచుంటివి?

వసం॥ (లేచికూర్చుండి) ఆర్యా! తామెవరు? ఇందు రాగతంబేమి?

సన్యాసి॥ మేము త్రిలోకసంచారులము. మాకు రాఁదగని ప్రదేశము లెందును లేవు. సర్వమును మే మెఱుఁగుదుము.

వసం॥ మహాశయా! చిన్నవిన్నపముగలదు.

గీ॥ సకలలోకైక వాసులై • సర్వమెఱిఁగి
యున్నవారలుగాన, నా•విన్నపంబు
నాలకింపుడు రే? నిజ•మాడఁగలరె?
పుత్రవాత్సల్యమున, నన్ను • బ్రోవఁగలరె॥ 115

కం॥ పలికిన నెదురాడదు, స
ర్వ్వలకేనియు బొంకురాదు • పొలఁతుక, యేకా
నల, “చెలికాడా” యనిసను
దలచుచు, బలువెతలఁబడుచుఁ • దాఁ దిరిగెడినో॥ 116

సన్యాసి॥ ప్రియమిత్రమా! నీపలుకులువిన సొంపుగనున్నవి. ఆశ్చర్యమును గొలుపుచున్నవి.

చ॥ జిలిబిలిముద్దుపల్కులును • జెల్వగురూపము, రాజ్యమేలఁగా
నలసిన మోముకాంతియు, ప్ర•భాత దినేశునిబోలు తేజముఁ
గలిగి, విరాగిరూపమునఁ • గాలముఁబుచ్చుట, వింత; యింకనీ
కిలనొక భార్యయుఁ గలదె! • ఏమివిచిత్రము ప్రాణమిత్రమా॥

మనోహరాకారా! నీకు భార్యయును గలదా! అయ్యో! ఆమె నేమిచేసితివి? ఆమెస్థితిగతులు నీవెఱుఁగవా? ఏమిచోద్యము?

వసంత॥ మునికుమారా! నే నబద్ధమాడువాఁడనుగాను. దయచేసి చెప్పుమా.

కం॥ కలదొక్క సతీమణి, నా
కులసతి, యర్థాంగలక్ష్మి - గుణగణములు నా
కలవియె వర్ణింపఁగ, నా
పొలఁతినిగని యున్నఁజెపుము - పూజ్యతఁగనుమా ॥ 118

సన్యాసి॥ వసంతా! భార్యయన నింతప్రేమగలవాఁడవు, గహనమున నేల విడిచివచ్చితి. ఎయ్యా? వెంటఁదీసుకొని రాలేకపోతివా? లేక నామెను మోయలేక వచ్చెనా? త్వరపడకుము మిత్రమా! నేను గొన్నిదినములకు పూర్వము (ఆలోచించును)

వసం॥ ఆర్యా! పదివేలవందనములు. దయచేసిచెపుమా, నే నీతాపముభరించుట కష్టసాధ్యము.

సన్యాసి॥ అయ్యో! జ్ఞాపకము చేసుకొనవలదా? నీవెండ్లాము స్థితిగతులు నన్నుడుగుదువని కలఁగంటినా యేమి? మించినదిలేదు.

వసం॥ మాటలచేతనే కాలముబుచ్చుచుంటిరేమి స్వామీ!

సన్యాసి॥ తాళుమా యింతసేపు. ఇప్పుడు తొందరగలిగెనా? కొన్నిదినములకుఁ బూర్వము నామిత్రుఁడగు యోగీశ్వరుని కుటీరమున నేను గొంతకాలము వాసముఁజేసితిని. అప్పుడు__

వసం॥ (లేచినిలువంబడి) మునికుమారా! ఆయోగీశ్వరుఁడే, ఆకుటీరమే, నాభార్యయునందేగలదు. ఇప్పుడందుండెనా! ఆదుండెనా చెప్పుము? అయ్యో! ప్రాణేశ్వరీ! సకలాభీష్టప్రదాయినీ! సర్వసద్గుణాలంకార ప్రభా! ప్రభా, ప్రభా, (మూర్ఛిల్లును)

సన్యాసి॥ (స్వ) అక్కటా! నామనోహరాకారుని, నాజీవితేశ్వరుని జూచిచూడక పూర్వమె, లోనుద్భవించిన మోహమింతయనఁజాల. వెంటనెకౌగిలించి గాఢాలింగనము జేయనుంటిని. పైఁబడనుంటిని. గాని యోగీశ్వరునాజ్ఞచే నణచియుంచవలసివచ్చె. అయ్యో! ప్రాణేశ్వరుఁడెంత బడలియున్నాఁడు! సర్వకాల సర్వావస్థలయందును నన్నే స్మరించుచున్నాఁడు. ఇఁక నెంతయని మరుగుపెట్టఁగలను? తాళఁగలను.

కం॥ కనులారఁగఁ బ్రాణేశ్వరుఁ
గనఁగల్గిన పుణ్యమెంచ-గాఁ నలవియె? నే

ధ్యానమున, దను, దలచుచు, నుం
డను, గన, నింకెంతయో ; కటా, దైవకృపన్ ॥ 119

(ప్రకాశముగా) రాజా! లెమ్ము. విచారపడకుము.

వసం॥ మునికుమారా! ప్రియ యెందుండునో దాచక చెప్పుమా. నీమేలు మరువను.

సన్యాసి॥ మదనాకారా! ఇంతవిచారము తగునా? ఆడుదానివలె విలపించుచున్నావేమి? ఆమెరూపమైనను జెప్పకుండిన, నాకెట్లు తెలియును? మంచిసౌందర్యవతియాయేమి?

వసం॥ ఆర్యా! నేనెంతని వర్ణింతును?

మ॥ మోముచంద్రునిబింబమే; సతి-మోవిబింబఫలంబె; యా
భామనవ్వులు నిండువెన్నెల - భాతినొప్పు మునీశ్వరా!
రామకంఠనినాదమా, యతి•రాజ మీస్వరమేయగున్
ఓమహాశయ! సుస్వరంబున • నుంచుగాదె, శమింపుమీ ॥ 120

స్వామీ! నన్ను మన్నింపవలయును. నాభార్య కంఠనాదమునకును, దమ కంఠనాదమునకును భేదములేదు. మఱియు (ఆలోచించును.)

సన్యాసి॥ ప్రియమిత్రమా! ఆలోచించుచున్నావేమి? నీమేలుగోరి యున్నవారిదగ్గర సైతము సిగ్గుపడుట, తగునా? మనమిప్పుడు మిత్రులమైతిమి. సర్వము నెఱింగింపుము.

వసం॥ మిత్రమా! నాయాపద్బాంధవుల సమక్షమున నాకేమిసిగ్గుగలదు?

కం॥ వనితారత్నము, రూపం
బున, వయసున, శీలమునను • బోలికయందున్
నినుఁబోలు, మధురభాషణ
లనుజేయును నీకుఁబలెనె • లాలనమదితోన్ 121

సన్యాసి॥ మిత్రమా! దుఃఖసాగరమున మునిఁగియున్నారని మీసన్నిధికి వచ్చినందుల కింత పాపమా! ఇంతయన్యాయమా!

అయ్యో! నావలె నీభార్య యుండుననుచున్నావు. పైఁబడెదవుసుమా. నాకు భయమగుచున్నది. కాముకుల నెవరు నమ్మఁగలరు?

గీ॥ ఇంత చెప్పియు తుదకు, నీ కాంత, నన్ను
బోలునని యుగ్గడించితి మేలు మేలు,
ఇంత పాపము తగునె! నీ చెంత నుండ
నొల్ల, మాటాడ నొల్ల, నా యుల్లమడలె ॥ 122

(అని లేవబోగా)

వసం॥ (పట్టుకొని కూర్చుండబెట్టి) మిత్రమా! భార్యావియోగమున నున్నాఁడఁగాన, మీయిరువురి రూప మొకటిగ నుండుటచే నట్లనుట యన్యాయమా? అయ్యో! నన్ను విడనాడిపోయెదవా? నిన్నుఁ జూచిన నాకు పరమానందము గలుగుచున్నది. విచారములన్నియు మాయమగుచున్నవి. దయచేసి నన్ను విడువకుమా.

[అనుబంధము 11.]

సత్యా॥ నీమాటల నమ్మఁజాల, నే నేగెదను.

వసం॥ వలదు మిత్రమా! పోవలదు. నేనును నీవెంట వచ్చెదను.

(రాజు దుఃఖాక్రాంతుఁడై ప్రవేశించును.)

రాజు॥ (స్వ) సోదరుని జేతులార వధించి, ఈ దురితాత్ముఁ డెంత సంతోషముగా నున్నాఁడు? అబ్బా యిట్టిఛండాలుఁడు లోకమున నెందైనఁ గలఁడా?

మ॥ మునివేషంబు ధరించి, సర్వజగతిన్ మోసంబులోఁ ముంచి, నా
తనయుం బట్టి వధించి, నిర్భయముగాఁ దానిందు సన్యాసినో
డను భాషించుచునున్న వాఁడకట, ఛండాలుండుగాఁ బుట్టకే
జననంబొందెనదెట్లొ? నా కడుపుఁ గాల్చన్ నీవు పాపాత్ముఁడై ॥123

(ప్రకాశముగా) వసంతా! ఇటురా,

వసం॥ తండ్రీ! వందనశతంబులు. నాయనా! ఇంతటి క్రూరాకారమున నున్నారేమి?

రాజు॥ ఛండాలుఁడా! తమ్ముని జేతులారఁ బట్టిచంపి, విచారము మాని, నన్నిట్లడుగుటకు నోరెట్లాడె? అయ్యో! కుమారుని జంపితివే, నా కుమారుని వధించితివే! కఠినాత్మా! నీముఖమును జూడవచ్చునా? నిన్నేమి చేసినను బాపమంటదు. మహాద్రోహివి.

సీ॥ ఏపాపమెఱుఁగని ♦ నాపాపనెట్టుల
వధియింపఁజేతులు ♦ వచ్చె, ఖలుఁడ ;
నీరాజ్యమునుగోరి ♦ నీకేమియపకార
మొనరించె నాసుతుఁ ♦ డో మదాంధ ;
మాయవేసమువేసి ♦ మౌనివృత్తినిజూపి
కడకిట్లు జేసితే ♦ కలుషహృదయ ;
దాయాది శత్రుత్వ ♦ మయ్యారె! చూపినా
కుఱ్ఱనిజంపితి ♦ క్రూరకర్మ ;

గీ॥ అయ్యయోవాఁడు నీతమ్ముఁ ♦ డంచుదలచి
యించుకేనియు దయనులో ♦ నుంచవైతి ;
వింతయాగడమిది తగు ♦ నే? వినాశ
మొందుకాలంబు నీకు ము ♦ న్ముందునడువ ॥ 124

వస॥ తండ్రీ! తిన్నగావచింపుడు. అయ్యో! నాతమ్ముఁడు వధింపఁబడెనా? అట్టి దుష్కృత్య మొనరించినదెవరు? సోదరా!

కం॥ విన్నటనంబున నాకడ
"కన్నా"యనివచ్చి, ప్రేమ ♦ నాలింగనమున్
మన్ననలఁ జేయుచుపు, చి
న్నన్నా! నిన్నెవరుజంపె ♦ నన్యాయమునన్ ॥ 125

రాజు॥ ఓరిపాపాత్ముఁడా! నీవక్రవినయములు నేనునమ్మను. నీవగపులను బాటింపను. నీదుర్నీతి నణచకుండను. మాయమాటలుమాని సత్యముబలుకుము. ఓరీ! కఠినాత్మా!

గీ॥ మాలమాదిగలకునైన ♦ జాలిగలదు,
ఎంతకఠినంబో? నీహృద ♦ యాంతరాత్మ
బాలునెబ్భంగి నీకర ♦ వాలమెత్తి,
యఱవ, గుత్తుకఁదెగఁగోసి ♦ తయ్యయో! దుష్ట! ॥ 126

వసం॥ తండ్రీ! నేనేఁ జంపితిననియా పలుకుచున్నారు?

రాజు॥ ఇంకను నమాయకత్వము నటించెద వేమి?

వసు॥ జనకా! నే నేకపటమెఱుంగను. మీకీ దుర్బోధనల నెవరుపదేశించిరి? మీరెట్లు నమ్మితిరి? అంతటిపాపమున కొడిగట్టుకొందునా? సత్యమును బలుకుచున్నాను.

కం॥ జనకా! రాజ్యము, సంపద,
ఘనభోగము విడిచి నేను • కానల నెటులో
మనుచున్నను, ననుబంధన
మునఁ దెచ్చితిరిటకు నేఁడు • మోసమువచ్చెన్ ॥ 127

కం॥ ఘనభోగంబులు, సంపద
లును రాజ్యంబులును సిరులు • లోలోననశిం
చునటంచు నెంచి నిశ్చిం
తను శంభునిగొలుచుచుంటిఁ • దడయక నడవిన్ ॥ 128

తండ్రీ!

గీ॥ ఎట్టికపటంబుగాని నే • నెఱుఁగనయ్య,
సద్గుణుని సోదరుని నేను • జంపనయ్య,
నమ్మినను సంతోషము • నమ్మకున్న
మరలనడచెద నడవుల • దిరుగులాడ ॥ 129

రాజు॥ అయిన నీకేమియును దెలియదా?

వసం॥ జనకా! మీపాదములాన, సూర్యచంద్రులాన, నే నెఱుఁగను.

రాజు॥ ఈ సన్యాసియెవరు? నీకెట్లు స్నేహమాయెను?

వసం॥ నేనిదివరకు నివసించిన యోగీశ్వరుని కుటీరమునను ండెనట. దారినిబోవుచు నా కడకరుగుదెంచె.

రాజు॥ స్వామీ! అంతయును వినుచుంటిరిగదా! ఈదుష్కృత్య మెవరుచేసియుందురు?

సన్యా॥ రాజా! మాకు సర్వమును తెలిసియున్నను, మేము నుడువరాదు. కొంతకాలమునకంతయు నీకే తెలియవచ్చును. అడిగితివిగాన గూఢార్థముగా జెప్పెదను. గ్రహింపుము.

కం॥ వనితలు చంచల హృదయులు
ఘనమోహాతురతనెట్టి • కార్యంబైనన్
వెనుదీయరు, పతినైనన్
తనయునినైనన్ వధింపఁ • దలచెదరుత్కృటిన్ ॥ 130

(వసంతుడు సన్యాసితో నిష్క్రమించును.)

రాజు॥ ఇంతచిత్రము నేనెందును జూచియుండను.

గీ॥ తల్లి చంపుననుచు • దలచుటధర్మంబు
గాదు, వీడుచంప • లేదు నిజము
సుతుఁడుచచ్చె, గొప్ప • చోద్యంబుగాఁదోచెఁ
గలుషులెవరు నాకు • గానరారు ॥ 131

కొంతకాలమైన పిమ్మటనైన నిజానిజంబులు బైటరాకుండునా?

(తెఱవంకఁజూచి) ఆహా! సేనాధిపతితోఁగూడి మదనాదేవి యిటువచ్చుచున్నది. పుత్రవియోగమువలనఁ గలిగిన దుఃఖమునకు దాళలేక నాకొరకైవచ్చుచుండునా? ఈసేనాధిపతి వెంటవచ్చుట కేమికారణము? నేనిందుదాగి వీరిప్రసంగము లాలకించెదను. (తెఱచాటునకుబోవును)

(ప్రవేశము—మదనయు, సేనాధిపతియు)

[అనుబంధము 12.]

సేనా॥ మదనా! ఇంతపంతము నీకుతగునా? ఆవసంతు డేమియపకారము నీకు చేసియుండె? నీమాటల కంగీకరింపలేదని బలికెదవు. పోనిమ్ము. ధర్మస్వరూపుఁడగు నీనాథుఁడు శత్రువెట్లాయెను? అయ్యో! చంద్రహాసుని జంపినకారణమునను నేను విచారపడుచుండఁగ పిట్టపిడుగువలె నిట్టికట్టడి పట్టుపట్టుట వినవలసివచ్చెనే? మదనా! ఆలోచింపుము.

కం॥ చిననాటనుండి పెంచిన
జనకసమానుండు రాజ • చంద్రుఁడువానిన్

ఘనతర దుర్వ్యథపాల్జె
సిననే భరియింపలేని • సీ! బ్రతుకేలా? ॥ 132

కం॥ మనగుట్టు తెలియునని రా
తనయుని జంపితిని యముని • దండనకర్హుం
డను; చాలక యింకెను రా
జును జంపగలాడగనెల్లు? • శోకము లేకన్ ॥ 133

కం॥ ననుమన్నింపుము, నాదా
రినిబోయెద, చాలు, నేభరింపను, మోహం
బున నొనరించిన కార్యం
బున కేవగఁజెందుచుంటిఁ • బుద్ధిసెడెగదే ॥ 134

నీకు పదివేలవందనములు. నన్ను విడువుము.

పద॥ ప్రాణపతీ! యుక్తాయుక్తము లెఱుగక పలుకుచున్నావేమి? నేను మనిషినిగా ననుకొంటివా? రాక్షసిననుకొంటివా? నాసుతుని జంపించినందులకు నాకు మాత్రము విచారములేదనుకొంటివా? అయ్యో! నేనీపట్టుపట్టిన కారణ మెంతచెప్పినను విన వేమి?

గీ॥ దాసదాసీజనంబుల • దారివేరు
గతిగనున్నది; ధాత్రిలో • పతికివారు
విన్నవింపుదురటుమీద • నిన్ను నన్ను
జంపఁబరపును; నానుడి • సత్యమగును ॥ 135

ఇప్పటికైన తెలిసెనా?

సేనా॥ ఇంతవరకు తెలియనిదేమిగలదు? ఇప్పుడు క్రొత్తగ తెలిసినదేమి? రాజవంశము నంతయు నాశనము సేయుటకు నీవు జన్మించితివి. నేనుమాత్రము సమ్మతింపను.

కం॥ మనగతి నితరులెఱింగిన
మనమాన ప్రాణములకు • మాన్యతచెడినన్
జనపతివిని కడుఁగినిసిన
వినుమా! నాజీవములను • విడిచెద; మదనా! ॥ 136

ఇది నామనోనిశ్చయము. తరువాత నీదయ. వారిప్రాప్తి.

మద॥ నీవు చంపవలదు. నేనేచంపెదను. ఇంతకైన సమ్మతించెదవా.

సేనా॥ నీపాపమున నీవుబోయెదవు. ఈగొడవ నాతోడచెప్పకుము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

రాజు॥ (ముందరికివచ్చి) [అనుబంధము 13.]

చ॥ తులువనుగూడి, నాసుతుని • దుర్వ్యథపాలొనరించి, నన్ను నె
ట్టులవధియింతునాయని, క•ళంగడు మాయలబన్నుచున్న దీ
పొలతి,కటా,"యమాయకులు•పూజ్యులు, కాంత"లటంచు బల్కువా
రలకిదియెట్లుతోచునొ? ధ•రన్ దురితంబులడంగుటెట్లుగా ॥ 137

మ॥ తనమానంబుఁ బరిత్యజించి, సుతునిన్ • దా గొంతుగోయించి, భ
ర్తనుజంపంగఁ దలంచుచున్నది విధా•తా! యిట్టిదుర్మార్గజా
తిని బుట్టించితివేల? లోకమున నీ•తింబాపి మూర్ఖతినిం
పనులొనెంచితి వెంతహాని, సుజనుల్ • భగ్నంబుగాగూలరే॥ 138

చ॥ కటకట, దుష్టశిక్షణ, సు•ఖంబులనిచ్చును సజ్జనాళిపా
లిటికని రామచంద్రుఁ డవ•లీల మహాసురకోటినంతయున్
బటుతరశక్తిచే నణచి • పాలనసేయడెమున్ను, యిప్పుడి
క్కుటిలులు రాక్షసాంశమునఁ • గొందరుబుట్టిరి కీర్తిఁగూల్పఁగన్॥

ఇప్పుడు సర్వమును తెలిసెగదా! సేనాధిపతిని మోహించి నాపుత్రునిజంపించి నన్నువధించుట కెంచుచున్నది. అక్కటా! దాని నీకరవాలమున ఖండింపనుంటెని గాని, యపకీర్తిని బాపుకొనగలనా? దేశదేశముల, నీకత, నిరాటంకముగా వ్యాపించి, నన్ను జనులందరును బరిహాసముగాఁ జూచుచుండరా? రాజులెల్ల హేళనచేయరా? కడకు నీచజాతివారికిఁగూడ నేను నిందాపాత్రముగానా? తరువాత రాజనైననేమి! ఎవరినైననేమి? అక్కటా! ఎంతసాహసము! కడుపునఁబుట్టిన పుత్రునికన్న, మోహమే ప్రబలమై యాధిక్యమై ప్రథమస్థానము నాక్రమించుకొనెఁగదా! ఇంకేటిజీవనము. ఇంకేటిరాజ్యము, నేనేమిరాజును. పాపాత్మురాలా! నాకులము చెడుపుటకు, నాపుత్రుల

నాశనముచేయుటకును, నన్ను తుదముట్టించుటకును, నాకొంపఁగాల్చుటకు, నారాజ్యమును నింద్యముచేయుటకు రాక్షసాకారమున జన్మించి నీకార్యమును జేసికొనుటకు సిద్ధపడుచున్నావా! ఎంతపనిచేసితివి? ఇక నీదుఃఖము భరింపలేను. నేను నాకుమారునితోఁ గలిసికొనెదను.

(నిష్క్రమించును.)

---

## చతుర్థాంకము - ద్వితీయరంగము.

రా జాం తః పు ర ము.

[పడకపై రాజు శయనించియుండును.]

(మదన ప్రవేశించును.)

[చేత నొకగిన్నెలో పాలుంచుకొని యుండును.]

మదన॥ నేటితో రాజుగతించును. వసంతుఁడూరలేదుగదా. నాసుతుఁడా మరణించెను. ఇక రాజ్యమేలువారెవరు? నాసేనాధిపతి, నాప్రాణపతి, నామనోహరాకారుఁడు. తానురాజై రాజ్యమేలుచుండ, నేను హాయిగనుందును. భోగాదిసౌఖ్యముల కొఱంకముగలుగదు. నిశ్చింత, నిర్భీతి, నిత్యానందము, సర్వమును గలుగనున్నవి.

గీ॥ ప్రాణపతియైన సేనాధి • పతినిగొలిచి
యతఁడు రాజ్యమునేలఁగ • సతివిభవము
మీఱ, కాలముబుచ్చ, స•మీపమయ్యె,
కోర్కెలన్నియు నొక్కటఁ • గూడివచ్చె॥ 140

(పాలగిన్నె బల్లపైనుంచి, వెళ్లిపోవుచుండఁగా, రాజులేచి)

రాజు॥ మదనా! వెళ్లుచుంటివేమి? కార్యము పూర్తిగాచేసివెళ్లిన బాగుండును.

మదన॥ చిత్తము. పాలుత్రాగెదరా? తెచ్చియిత్తునా! నాధా! కడుబడలియున్నారు. సత్వరమున నాహారమును బుచ్చుకొనుఁడు.

రాజు॥ మదనా! నామేలు గోరినదానవు నీవుగాక మఱెవ్వరుగలరు. నీపతిభక్తికిని, నీ వినయవిధేయతలకును, సంతోషపడుచున్నాను. నీవు నాప్రాణేశ్వరివికావా?

మదన॥ ప్రాణేశ్వరా! సతులకుఁ బతులకన్న వేఱుదైవమెవరు?

ఆ- వె॥ సర్వదానములకు • సర్వధర్మములకు
సర్వదీక్షలకును • సర్వమునకుఁ
గలుగుఫలము బతిని•గొలుచు కాంతకుఁగల్గు
గాన నాకువలదు • గరిమయింత ॥ 141

కం॥ పతిపాదములే, సతతము
సతులితగతిఁ దలచుసతికి • యశమేకల్గున్
పతిఁగని దూఱెడికాంతకు
నతిహీనత, జనులునవ్వ • లాడఁగఁగల్గున్ ॥ 142

మనోహరా ! చనవుగా బలికినందులకు మన్నింపుడు.

రాజు॥ మదనా ! ఇంతటి పతిభక్తిఁగల మహాపతివ్రతవు, నీ వహల్యాతారాదిమానినీ మణులతో సరితూగుచున్నావు. నీప్రభావము నెంతగఁ గొనియాడఁగలను!

మదన॥ నాథా ! పాలుకొంచెము పుచ్చుకొనరా? అలసియున్నారు.

రాజు॥ ఆలస్యమెందుకు. త్వరితముగ దెమ్ము.

మదన॥ (వినయముతో పాలగిన్నెను దీసుకొనివచ్చి) ఆరగింపుడు.

రాజు॥ మంచిది. నీవు కొంచెముపాలుత్రాగి నాకిమ్ము.

మదన॥ (స్వ) కనుఁగొనెనాయేమి? అంతటిమగతనమా?
(ప్ర) ఇదేమిఅన్యాయము. నాకు త్రాగుటకు పాలులేదా? సమయములేదా ? మీరలసియున్నారు గాన తామే యారగింపుడు.

రాజు॥ నేనువినను. నీవు త్రాగితీరవలెను.

మదన॥ ఇదేమి పట్టుదల? నాకువలదన్న బలవంతమేల?

రాజు॥ నామేలు గోరినదానవు నీవు త్రాగకున్న నేను త్రాగుదునా?

మదన॥ ప్రాణపతీ! నామాటవిని నిర్బంధింపవలదు. నాకడుపునిండుగానున్నది.

రాజు॥ కొంచెము పుచ్చుకొనిన, మోసమురాదు. రమ్ము. భయమెందుకు? ఇందు విషము గలుపలేదుగదా? పాలుమాత్రమే.

మదన॥ (స్వగతము) ఇతఁడు నిజము గ్రహించినట్లున్నది. ఇక నేనుచచ్చినదాననే. నిదురించుచున్నాఁడని యేమియో మాటలాడుచుంటిని. ఇప్పుడేదారి ? దైవముగలడు. (ప్రకాశముగా) మనోహరాకారా! నాప్రాణనాథా ! మీకు నర్థాంగలక్ష్మినై పరగుచు నొక్కమనవికైన తగనా? ఇంతపట్టు తమకుచెల్లునా ?

సీ॥ కులటా! నీకథలన్నియుఁ • దెలియవచ్చె,
మమ్ము నందర వధియింప • మాయఁ బన్ని
యున్న నీదురితంబుల • నెన్నఁ దరమె
రాజకులమున రాకాసి • వై జనించి ॥ 143

రాజు॥ మదనా! కడుపునిండ కలుషమునుంచుకొని, యిన్ని అబద్ధములెట్లాడితివో, విధాత ఇంతటి హృదయమెట్లు సృష్టించెనో, నేను చింతింపఁజాలకున్నాను. నీవుచేసిన దుష్కృత్యములవలన లభింపనున్న పాపమునకన్న, నిప్పుడు పలికిన నీ యసత్యములకు యెక్కుడుపాపమును గడించితివి. నీవొనరించిన యకార్యములకు విధింపఁగలశిక్ష నాకు తెలియకుండుటచే, నేను నిన్ను భగవంతుని వశముచేసితిని. దైవమైనను, నీకెట్టిశిక్ష విధింతునాయని కొంతవడి ఆందోళనపడఁగలడు. అక్కటా! ఇంతమోహమా? సవతికుమారుని వరించుటయా; వాఁడువలదని యడవులకేగిన బట్టితెచ్చుటయా; వానిని కడుగాసిపెట్టుటయా; వానిసతిని జంపించుటయా; త్రుటిలో వానిపై మోహమునువిడనాడి నీచుని వరించుటయా; దుర్మదమున కన్నకుమారుని వధించుటయా; ప్రపంచమెల్లని సవతికుమారునిపై నిందమోపి వానిని యడవులకనుపుటయా; కడకు నాప్రాణమును దీయుటకె సిద్ధపడుటయా; ఆహా! విపరీతముగదా! కోమలీ! ఇన్నిదినములనుండియు రాజ్యభారమునువహించి, అనేకవిషయముల నెఱిగితినిగాని, ఇట్టితరుణి ఎన్నడుగాని నిందింతురాలుఁగ నాకడకుఁ బట్టుకొని రాబడలేదుగదా! అట్లు తీసుకొనిరాబడిన, నేనే శిక్షవిధింపగలుగుదునో యెఱుఁగకుందును. తరుణీ! నీవు నీజననీజనకుల నిర్మలవంశమునకుఁ గళంకముతెచ్చి, వారిని నీదుర్యశమున నీవెంటనె గొనిపోవుచున్నావు. అబ్బా! నీహృదయకాఠిన్యమున కేమందును? నీదుష్కృత్యముల నెట్లు దలంతును? నీసాహసమున కెంతయాశ్చర్యపడుదును? నీవు నిజముగ మానవాకారమున జనించిన రాక్షసివగుదువుగాక. కాకున్న కడుపునబుట్టిన పుత్రుని జాలిమాలి నఱికెంతువే! శిశుహంతకీ!

కం॥ తెలిసెను నీవగలెల్లను
తెలిసెను నీచిత్తవృత్తి • తెలిసెను నీమా
యలు నీచేతలు నీనడ
తలు నీమృషలవినయములు • తంత్రములుభళీ! ॥ 144

కం॥ చెలిసెను సవతికుమారుని
వలచినగతి, పాపమనక • పసిబిడ్డను జే
తులఁబట్టి చంపుగతి, నీ
తులగతి, నను జంపనెంచు • తులువతనంబున్ ॥ 145

కం॥ ఇంతటి దుష్కార్యంబుల
నెంతటి నిర్దయను జేసి • తే? మదిలో నీ
కింతయు జింతయుగలుగదె?
ఎంతని విలపింతునే? సహింతునె, కట్టా! ॥ 146

కం॥ ఒకరాజునకును బుట్టితి;
ఒకరాజును బట్టితివి య • శోన్నతి చెలియల్
సకలోపచారములు మ
చ్చికఁ జేయగ, రాణివనుచుఁ • జింతమఱచితే ॥ 147

శా॥ ఔరా! నీమది కింతజాలియును లేదా! నీచునిన్ గూడి శ్రీం
గారాకారుని నీకుమారు నెటులన్ • ఖడ్గంబు పాల్జేసితో?
వీరావేశముతోడ నన్నిపుడు జంపింపంగ పాలిచ్చితో?
నీరేజాస్యల పేరుజెప్పుటకు తప్పే నీవు జన్మించుటల్ ॥ 148

కం॥ కులగౌరవంబుఁ జూడక
వలపున సేవకుని గూడి • పతిజీవంబుల్
తొలగింపఁ జూచితివి నీ
కలుషంబుల నెన్నదరము • గాదు, భళిభళీ! ॥ 149

గీ॥ ఇంత దుష్కార్య మొనరించి • తీవు; తుదకు
దాసివృత్తిని నీచుని • దయకులొంగి,

కాలమును బుచ్చుచావు, యిట్టి • కార్యములకు
గలుగు ఫలమిదియని నీకు • తెలియగలదె ॥ 150

ఛీ! నీముఖము చూడరాదు. అటుపొమ్ము.

ఆహా! నారాజరికమునకన్న కూలివానిప్రత్తి వేయిమడుంగులు మెచ్చదగియున్నదిగదా! ఇట్టి దుస్థితియందు నేను రాజనని సంతసించుట యెంతవెఱ్ఱి? నన్ను మించిన నిర్భాగ్యుడు ప్రపంచమున నెవ్వడుగలడు? ఇట్టి చిత్తక్షోభ ననుభవించువా డెవడైనగలడా? భార్య జారిణియై, కుమారునిజంపింపఁ జూచుచున్న కఠినాత్ము డెవ్వడైన గలడా? నేనురాజనా? ఆహా! అట్లనుటయు సిగ్గుగనున్నదిగదా?

కం॥ తలపగ రాజనగా న
వ్వులపదమై ధాత్రినిల్వ • బోవును ; జీవం
బుల విడనాడియుమాధవ
నిలయంబును జేరి, యందు•నిలిచెద నిటుపై ॥ 151

కం॥ నలుగురువిని నా బ్రతుకును
పలుపలువిధములుగ నింద•పాలొనరింపన్
దెలిసియుఁ దెలియనియటులను
నిలువగ లేనికను శంభు•నిన్ బూజింతున్ ॥ 152

శంభో! పార్వతీరమణా!

ద్విపద.

ఇలగల సకలప్రాణుల తండ్రివీవె,
కలుషములడగించు - ఘనదాతవీవె,
నిరుపేదలనుగాచు - వరదాతవీవె,
కరుణాకరుండన - గా, శివ! నీవె,
దీనులు భజియించు - దేవుడవీవె,
కానికార్యములకు - ఖండనమీవె,
దుష్టులశిక్షింప - దోర్బలుడీవె
శిష్టులగాచెడి - శ్రీమంతుడీవె

ననుగని నామొర - వినినాకుదాఁ
గనుగొనజేయుము - కడుచింతనొంది
వెతలనుబడలేక - వేదనబొంది
మితిలేని దుఃఖంబు - మేనునజెంది
అటునిటుకదలలే - నయితినా బ్రతుకు
కటకటకడుఁగోసి - గాసిలెనయ్యా.
ఇకనాకు రాజ్యంబు - ఈసంపదలును
సకలభోగంబులు - చాలునుతండ్రీ
చెడుపేరుబడలేను - క్షితిపయినుండి
కడుదయతోడన - గ్గావుము, తండ్రి.
వినయంబుగాపది - వేలమ్రొక్కులను
మనసారఁజేసెద - మన్నించుతండ్రి.
శ్రీమహేశా! సాధు-సేవ్య! గిరీశ!
శ్రీమహాదేవ నీ - చిత్తము శరణు ॥ 153

(అని పాలగిన్నెను తీసికొని పాలుత్రాగును)

(అవనికజారును)



# వసంత ప్రభ.

## పంచమాంకము - ప్రథమరంగము.

(ప్రవేశము - పౌరులు.)

[అనుబంధము 14.]

మొదటి పౌ॥ చూచితిరా? ఇక మనయవస్థ నాలకింపువాఁడు భగవంతుఁడే. తుచ్ఛవగు ప్రభునితో మనమేమి చెప్పికొనినను ప్రయోజనము కలుగదు. రాజవంశజునకు రాజనీతి పట్టుబడును గాని, నీచవంశమున జన్మించిన వీని కేమియెఱుక? వీనిరాజ్యమున మనమెట్లు జీవింపగలము? మనకువలదు.

మత్త॥ ఇంతనీచుని రాజ్యమందున - నెట్లునిల్వఁగనౌను? యా
వంతజాలియు, ధర్మబుద్ధియు - పాపభీతియు లేదు;

రెండవ పౌ॥ హా!
శాంతచిత్తుఁడు కాఁడు, దుష్టుఁడు, • చాలక్రూరుఁడసాధ్యుఁడుగా
జెంతఁ జేరుట యేయుపాయము • చేయనేమియుఁదోచదే? 154

మూడవ పౌ॥
చింతయేల? యరణ్యసీమలఁ • జేరి రాసుతుఁడెందుదా
వంతలన్ బడుచుండునో గని • వాని రమ్మని వేడ,

నాల్గవ పౌ॥ వా
డంతమూర్ఖుఁడొ? రాజ్యమొల్లఁడొ • ఆలకింపఁడొ మమ్ము, భూ
కాంతుఁడై సతితోడఁగూడి, సుఖంబునన్ ధరనేలఁడో॥ 155

మొదటి పౌ॥ మనమందరమును గహనములకేగి రాకుమారుని స్థితిగతులనరసి, ఆతనిని ప్రార్థించి రాజ్యమునకుఁ దీసికొనివచ్చిన మనకు సుఖమును యశమును గలుగును. రామరాజ్యమువలె మనదేశ మభివృద్ధియగును. ధర్మదేవత స్థిరముగ నిలుచును. ఇన్నిమాటలేల? పోదము రండు.

(నిష్క్రమింతురు.)

## పంచమాంకము - ద్వితీయరంగము

(ప్రవేశము - సేనాధిపతి.)

సేనా॥ ఏకాలమున నేదశముననుజనకు సంభవింపగలదో, ముందుగ తెలియదుగదా! నేను రాజనగుదునని యెన్నడైనఁ గలనైన దలచియుంటినే? మొదట రాజునకు సేవకుడనై, క్రమముగ సేనాధిపతినై, పూర్వపుణ్యవశమున నేటికి రాజనైతిని. ఆహా! రాజనైతిని. గాని పూర్వచరిత్రమును దలచినమాత్రము గుండెలదరుచుండును.

అక్కటా!

కం॥ జనకునివలె, దైవమువలె
గనుచుండిన రాజునణచి • కడకీరాజ్యం
బును బాలింపవిచారము
మనమున దృఢముగనునిలిచి • మానకయుండెన్ ॥ 156

ఆహా! ఆధర్మప్రభుని సద్గుణముల నెంతని గొనియాడగలను?

కం॥ పలుక డసత్యము లెన్నడు
దలపడు పరకాంతమాట • ధర్మపథంబున్
దొలగడు కలనైనను, బే
దల మొరలనుదప్పి పోడు•దయవీడడుగా ॥ 157

నేను నిక్కముగ స్వామి ద్రోహిని. నన్నుబోలిన పాపకర్ముఁ డెందైనగలడే!

కం॥ తనమానంబునుజూడక
తననాథుని గౌరవంబుఁ • దలపక, నమర
మ్మని జేరినకాంతను నే
ననుమానము లేక గూడ•నగునా? తగునా? 158

ఇంతకును విధిబలమట్లున్నది. నేనేమి చేయగలను? ఇక నీవిచారమునుమాని సుఖించుటయె మంచిది. అయిన మదనతో నెట్లుగూడియుందును? ఆమె హృదయమంతయు నాకు తెలిసియెయున్నది. సవతిసుతునిపై మరులుగొనిన పాపాత్మురాలు. కదు

పుసఁబుట్టినఁ సుతుని జాలిమాలి చంపించిన క్రూరరాక్షసి తననాథునకు విషమొసంగిన దురాత్మురాలు. ఆహా! దానిని నమ్మవచ్చునా? దానిముఖమును జూడవచ్చునా? దానితోపలుకవచ్చునా! దానిసదనమునకు బోవచ్చునా? ఆపాతకురాలికి గౌరవమీయవచ్చునా? బాగుగ జ్ఞప్తికివచ్చినది. దానిదుష్కృత్యఫల మదియనుభవించి తీరవలెను. కానిమ్ము.

(ప్రవేశము - మధురిక.)

మధు॥ నాథా! వందనములు.

సేనా॥ ప్రేయసీ! రమ్ము. విశేషములేమి?

మధు॥ మనోహరా! మదనాదేవిగారి యాజ్ఞలనిర్వహింపలేక దాసీజనంబులు విచారమునన్నారు. రాజుగతించిన దుఃఖమామె కొంతయులేదు. దినములు గడుపుట కష్టసాధ్యముగనున్నది. తాము కొంచమాలోచింపవలయును.

సేనా॥ దేవీ! నీకేమిబాధ కలుగలేదుగదా?

మధు॥ ప్రాణేశ్వరా? నన్ను మన్నింపవలయును. నేను తమసతిని గనుక నన్ను మఱింత బాధించును. చెప్పిన తమకు కోపమువచ్చునని వెఱచుచున్నాను.

గీ॥ చేయరాని యకార్యముల్ • జేయుమనుచుఁ
గఠినముగ బల్కి దండించు•గాని యింత
దయనుజూపదు; మీ సన్ని•ధానమునకుఁ
జేరవలదని పలుమారు • చెప్పుచుండు॥ 162

నాథా! ఇదేమిప్రారబ్ధము? నన్ను మీరిరువురునుగలిసి వధింపరుగదా! మీదయ.

సేనా॥ దేవీ! నీవు భయపడనేల? నీవిప్పుడు రాణివి. దానియాజ్ఞలతో నీకేమిపని? నీవు చేయవలదు. చేయతగవు.

మధు॥ భాగ్యము. తమదయకు పాత్రురాలను.

సేనా॥ మనోహరీ! మనుజులను జంపుటకు బుట్టినరక్కసి మదన. నీవు జాగ్రతగ నుండుము.

మధు॥ ప్రాణేశ్వరా! తాము రాజపదవికివచ్చి, దానికి భయపడవచ్చునా? కఠినమైన చట్టములచే దానిని బంధింపలేరా? విడిచినమాత్రము మోసముగలుగును.

సేనా॥ కోమలీ!

గీ॥ నిక్కమువచింతు నదిరౌనొకొ • నెక్కసియగు;
శాంతనుసుతుఁడున్న లేఁడింత • శోకమైన,
మగని చావ్రకటింతయు • దిగులు లేదు
ఇంతపాపిని జూడలే • దెన్న డేని॥ 163

(ప్రవేశము - మదన.)

మద॥ మనోహరా! రెండురాత్రులనుండియు, నీవు రాకుండుటచేఁ గడుతాపము నొందితిని. ఏమి, దయతప్పెనా?

సేనా॥ నీకు నాదయతో నవసరములేదు నీదయ నాకవసరము.

మద॥ ఇట్లనెద వేమి? నాదయతో నవసరము తీరెనుగదా? ఇక నీచిత్తము.

సేనా॥ మదనా! అట్లనకుము. మాప్రాణములు నీచేతనున్నవి. గనుక భయపడు చున్నాము.

మద॥ నేను దయ్యమనియా, భూతమనియా, ననుజూచి భయపడుట. అన్నిటికిని సమర్థుఁడవు నీవే.

సేనా॥ దయ్యమైనను, భూతమైనను, మంత్రతంత్రములకు భయపడి పరుగెత్తును. నీకు అవియేపాటి?

మద॥ అయిన నన్ను గొప్పరాక్షసిగ భావించితివో!

సేనా॥ మదనా! నిన్నెట్లు భావింపమందువు!

కం॥ వలపున సవతికుమారుని
బలిమిని గోరుటయు, చిన్ని • పాపనిజీవం
బులదీయుటయును బాలను
గలుపుటయును విషము ప్రాణ • కాంతునిమృతికై ॥ 163

ఇన్నియు జ్ఞప్తికివచ్చుటచేత, నిన్నెట్లుభావించుటకును దోచకున్నది. భయమగు చున్నది.

మద॥ సేనాధిపతీ! నీసతియెదుట నన్నవమానపరచెదవో? ఇది నీకు ధర్మమౌనా?

సేనా॥ నేను రాజునుగాని సేనాధిపతినిగాను. నీ మనోహరుఁడనుగాను. నాసతియెదుట నన్నేల యవమానము జేసెదవు?

మద॥ నిన్ను "రాజా" యని పిలువవలెనా ? అయిన నేనును విధేయురాలనై నీకు మ్రొక్కవలెనా ?

సేనా॥ సందేహమేమిగలదు!

మద॥ అయిన మీయిరువురకును విధేయతఁ జూపవలెను గాబోలు.

సేనా॥ మదనా! నన్నడుగవలెనా ?

మ॥ పలుమాటల్ వచియింపనేల వినుమా • పాపాత్మురాలీవు, స
న్మ్యాలజీవంబులఁ దీయురక్కసివి, ని•న్నుంజూడ పాపంబగున్
బాలతీ ! నీవిక దాసివై మధురికన్ • బూజించుచున్ దానియా
జ్ఞలపాటింపుచు నుండగావలయు న•జ్ఞానంబుఁ బోఁదోలుచున్॥ 162

చ॥ చనవుననిన్ని నాళ్లు నను•జయ్యనజేరి "ప్రియా"యటంచుఁ బి
ల్చిన గతినెల్లమాని, కడు•సిగ్గున నీదగువారిచెంత నే
వినయముగా వసింపవలె • విన్నదనంబున నుండగావలెన్
వనితరో ! నీవు రాణివని • ప్రజ్ఞలమాత్రము గొట్టబోకుమా ॥ 163

కం॥ చంపితివి కన్నకొడుకును
బంపితి వడవులకు సవతి•పట్టిని, నాథున్
జంపఁగ విషమిచ్చితి, లోఁ
గంపము జనియింపదెట్లొ • కఠినమొ? మదనా! ॥ 164

ఉ॥ ఇంతటి దుష్టచిత్తవని • యెంచియు, నీకసమాన గౌరవం
బింతులతో సమానముగ • నిచ్చుటకెట్లగు? నిన్ను నమ్మిభూ
కాంతుడనేనటంచు పలు•కన్ దగునెట్లు? నిజంబు; నీవు నా
కాంతకు దాసివై మెలగ • గావలె, ధీరతలేక కోమలీ! ॥ 165

మాయిరువురకును మ్రొక్కుము. ఆలస్యము పనికిరాదు.

మద॥ మనోహరా !

సేనా॥ నీమనోహరుడు స్వర్గమునను న్నాడు. మొదట నాయాజ్ఞల బాటింపుము.

మద॥ (కోపమున) ద్రోహీ ! నాకు నీగుణ మిపుడు తెలిసినది. నాముద్దుల బిడ్డడును నానాథుఁడును జెప్పిన విననైతిని. అక్కటా! ఎవరిని మోహించి నాకొడు

కను జంపుకొంటిని? ఎవరినినమ్మి నానాథునకు విషమొసంగితిని? ఓరి కృతఘ్నుడా! ఒరినీచుఁడా! కపటు నీగుణ మిట్టులమారునే! నన్ను ‘‘దాసీ’ యనిబిలుతువే? మీయిరువురకును మ్రొక్కుమందువే? ఇన్నివిధముల నిందింతువే? దైవమా!

కం॥ ఎఱుఁగుచూచిన నెవ్వరున
న్నిటు రమ్మనువారు లేక • హీనతనుంటిఁ
గటకట నాకీజీవం
బిటుపై పోయినను దుఃఖ•మే లేకుండున్ ॥ 166

సేనా॥ నీవినయముల నిక కట్టిపెట్టుము. నిన్ను కారాగృహమున నుంచెదను. ముందు నడువుము.

(నిష్క్రమింతురు.)

(మదన మరల ప్రవేశించును.)

మద॥ (అనుబంధము. 15)

అక్కటా! నాయవస్థ ఇంతకువచ్చెనా? నాదశ ఇంతకుదిగెనా? నాభోగ మింతటి దౌర్భాగ్యమాయెనా! అయ్యో! ఇప్పుడు నేనెవరితో మొరపెట్టుకొందును? నాయెడ పశ్చాత్తాపముగలవారెవరు? నన్నాదరించువారెవరు? ఈదుష్టుని సంహరించువారెవరు? ఈవిపత్తు తొలగించువారెవరు? ఎవరుగలరు? అందరిని జేతులార జంపుకొంటిని. సజ్జనుడగు సవతిసుతునిగోరి, అతని మనసునొప్పించి విపినావాసము జేయించితిని. కన్నీరుమున్నీరై గార నేడ్చు పతివ్రతాశిరోమణిని ప్రభను కఠినముగ నిందించి విచారపెట్టితిని. పాదములపైఁబడి ‘‘అమ్మా! రక్షింపుమ”ని విలపించిన నాకన్నబిడ్డను జాలిమాలి జంపించితిని. లోకమే నేననిభావించి, మోహాతిశయమున సర్వసౌఖ్యములనిచ్చి గౌరవించిన నాభర్తకు విషమొసంగితిని. నీచకులమునఁబుట్టిన సేవకునకు నామానము నర్పించి, నాదేహమతని స్వాధీనముచేసి, అతని యిష్టానుసారము వర్తించి, రాజవంశము నంతయు వినాశమొందించితిని. అక్కటా! నాకీదురవస్థ సంభవించుట కేమియాశ్చర్యము? ఇంతకన్న వేయిమడుంగు లెక్కుడుగ సంభవించినను విపరీతములేదు.

హా! నాదుష్కృత్యములు, దురాకృతములు, దురాలాపములు, దురంతములు,—
ఘోరహత్యలు, మహాపాతకములు, రాజద్రోహములు, నీతివినాశములు,
కర్ణకఠోరములు, హృదయాందోళనములు.

హా! హా! చిన్నికుమారా! నాదరికి వచ్చుచున్నావా? నేను నీతల్లినని ఇంకను ప్రేమించుచున్నావా? నీకనులవెంట ధారలుగగారు నీరెందులకు? నిన్ను జంపించితి

నాతండ్రీ? నాప్రాణమా? నాపుణ్యమా? నానోముఫలమా? నాయనా? దగ్గరకురా? నన్ను కౌగిలించుకొనుము. నాకొకముద్దిమ్ము. నన్ను మన్నింపుము. అయ్యో! పుత్రా! నాశిరమును ఖండింపుము. కటకటా! ప్రాణేశ్వరా! నన్ను శిక్షించుటకై వచ్చుచున్నావా? నీవు ధర్మరాజవు. నిశ్చలచిత్తుఁడవు. ఉదారుఁడవు. శాంతుఁడవు. నాథా! నాదురితములకు నన్నేల శిక్షింపవైతివి? నన్ను ముక్కలుగ తెగగోసి, కుక్కలకాహారముచేసిన బాగుగనుండెడిది. దినమునకొక అంగముచొప్పున ఖండించి, నన్ను వధించినను బాగుగనుండెడిది. నగరమున నాదుష్కృత్యములను బ్రకటించి, నన్ను పరిభవించినను బాపములేకుండెడిది. అయ్యో! నన్ను విడనాడితివా! ఇదియు తగుశిక్షయె? అహా! దాసదాసీజనంబులు కనుసన్నలమెలగి సకలోపచారములను జేయుచుండ, రాణినై సకలభోగములనుభవించు నేను నీచసేవకుని బానిసనై, విధేయతను జూపుటకన్న నెక్కుడుశిక్షను బొందనేల? దైవమా! నేను నిజముగ దాసిగనుండతగుదును. వారిపాదోదకమును శిరముపై నుంచుకొనఁదగుదును. నాదుష్కృత్యములకు మితిగలదా? నాదుష్కర్మఫలమనుభవింపక తప్పునా?

ద్విపద.

అక్కట నాజన్మ - మఱియగనేను
రక్కసినేగాని - రమణినిగాను
ననుబోలువారలెం - దునుగానిలేరు
గనఁబోరు వినఁబోరు - జనులారవీరారు.
ఘనమోహమునకన్న - తనయునిజీవ
మునుదీసినట్టిదా - నినినేనునిజము
సవతికుమారుని - గవయఁగనెంచి
లనలేశమైనద - లంకనునిజము.
నామనోనాథుని - నాప్రాణవిభుని
నామహాశయుని పుణ్యచరితుజీవ
ములదీసినట్టికొ - మలినేనునిజము.
గలరెనాసరివార - లిలనెందుగాని
ఎంతపాపము ఘోర - మెంతదుష్కృత్య
మెంతటినిందనా - కెంతటిపేరు

ఎంతటినాశనం • బెంతదుష్కీర్తి
ఎంతటిసాహసం • బెంతటిధైర్య
మెంతటిఫలమునా • కెంతటిభోగ
మింతగాఁగన్న నిం • కెంతగానలయు. 167

(నిష్క్రమించును.)

---

పంచమాంకము - తృతీయరంగము.

(అరణ్యము.)

యోగీశ్వరుని కుటీరము.

ప్రభ॥ స్వామీ! ఇక ముందుకావలసినదేమి?

కం॥ కనడాయెను ననుసైతము
వినడాయెను మీరునుడువు - విధమును, రాజ్యం
బున కరుగుదలపు లేదా
యెను, నిక మార్గంబుతోఁచ-దే; యేమందుఁ॥ 168

యోగి॥ అమ్మాయీ! ఊరడిల్లుము. మరల నేనొకసారి చెప్పెదను. వినకున్న తరువాత విధానముగలదు.

(ప్రవేశము - వసంతుడు)

వసం॥ గురువరా! వందనములు. తాముపదేశించిన తత్వమసమానము. మోక్షప్రదము. ఆహా! నేను నిజముగ ధన్యుడను. నాసవతితల్లి నాకుచేసిన మేలింతని గాని యాడగలనా?

గీ॥ పొలతిననుగోరి ఘోరాట•వులకుఁబంపి
యుండగాగాదె? మీదరి • నుండగలిగె
నింత తెలయగ గలిగెనా • చింతలెల్లఁ
బోవగాగల్గె నాపూర్వ • పుణ్యముననుఁ॥ 169

యోగి॥ నాయనా! ఇట్లుండుట నీకిపుడుతగదు.

మత్త॥ వింతగాదె కుమార ! నీయట • వీనివాసము గాంచుటల్
చింత సేయును ! రాజ్యలక్ష్మిని • జేవిడన్దగ దయ్యయో.

వసం॥
పంతమేల ? మునీశ్వరా ! నిర • పాయమైన మహేశ్వరున్
జింతయే పదివేలుచాలును - శ్రీ సుఖంబుల నెల్ల

ప్రభ॥
న్నింత సేయుటకా ఘనాటవి • కీర్ష్యి తెచ్చితి నామనో
కాంతుడా ! కనుపార నెచ్చితి • గాసి జెందితి నయ్యయో

వసం॥
ఇంత యేలను బుట్టినింటికి • నేగుమంచు వచింపఁగా
గాంతనా మొరనాలకింపక • కష్టముల్ గడు బొందుటల్ ॥ 170

యోగి॥ వసంతా ! నామాటవినుము. నేను నీమేలు గోరినవాడను.

చ॥ అడవులఁ గందమూలముల • నాకటి దీర్చికొనంగ లేవు, మం
జులతర భక్ష్యభోజ్యములె; • నూదుల పోలిక గ్రుచ్చుముల్లులన్
అడుగిడ లేవు రాజమకు • టాంశువు లే; దృఢసింహగర్జనం
బులవిన లేవు మాగధుల • బోధనలే ; ధరణీపురందరా ॥ 171

నాపలుకులవిని సతీయుతుడవై నీరాజ్యమునకుఁబొమ్ము. నీకు క్షేమముగలుగును.

వసం॥ స్వామీ ! ఇంకను రాజ్యమా, వైభవమా, భోగమా, ఆర్యా ! ఇట్టి పాప కార్యములు సేయుమని తాముబోధించుట తమమర్యాదకు భంగమని మనవి చేయుచున్నాను.

చ॥ ఎదియెటులైననేమి తప • మేశరణంబని సర్వసౌఖ్యముల్
వదలి తదేకనిష్ఠ దవ్వు • లన్ బరతత్త్వవిచారణాక్రమం
బొదవ మహర్షివర్యులెటు • లో దినముల్ తుదముట్టచేసి, స
మ్మదమును గాంచుచుండ నను • మాన మొకో యిటువంటి వృత్తికిన్॥

యోగి॥ రాసుతా ! నీచిత్తము. అమ్మాయీ ! ప్రభా ! నావెంటరమ్ము.

(ప్రభ యోగీశ్వరునితో నిష్క్రమించును.)

వసం॥ ప్రపంచమెంత కపటముగనున్నది. జపధారులగువారలకె కామినీసంభోగమందు కోర్కెలుబుట్టుచున్నవి. పవిత్రులమనిమాత్రము పలికెదరు. దైవమా! నామనోనిశ్చలతను స్థిరముగనుంచుము.

(అని కూర్చుండి జపించుచుండును.)

(ప్రవేశము - ఇరువురు సుందరులు.)

అక్క॥ చెల్లెలా! ఋతువులలో వసంతమునకు సమమగునది లేదుగదా!

కం॥ ప్రాలేయమ్ము నివారించును
బాలతులకు సమానభోగ • ములనొనగూర్చున్
లలితకుసుమముల నెత్తా
వులనిచ్చు వసంతరాజ • పూజ్యుండెలమిన్ ॥ 173

చెల్లి॥ అక్కా! దేవతలకన్న మనుష్యులెక్కువ సుందరముగనుందురని విందును. నిజమా?

అక్క॥ అమ్మాయీ! సంశయములేదు. నీకు మంచిరాకొమరుని గూర్చెదనులె?

చెల్లి॥ అక్కా! ఈవనరమణీయ మద్భుతముగనున్నది. ఇంకేమి చిత్రములుగలవో చూతమిటురమ్ము.

(ఒకవైపున కేగుదురు.)

వసం॥ (కన్నులదెరచి) ఈ దేవకాంతలెవరు? వీరిసౌందర్య మిదివరకు వినియుంటిని గాని గనియుండను. నిజముగ నేడు నాజన్మపావనమైనది. అహా! ఇట్టివారుగద సంభోగింపదగినవారు. నాకంత పుణ్యముగలుగునా? వారింకేమి చేయుదురో చూచెదను.

అక్క॥ చెల్లెలా! ఇటురమ్ము. ఆమహనీయుని జూచితివా? వారు పూజ్యులు. వందనీయులు. వారికి సేవచేసిన కడుపుణ్యము. నాకు పనులుగలవు. నేబోయెదను. వారికింతసేవచేసి నీవురమ్ము. (అక్క నిష్క్రమించును.)

చెల్లి॥ (వసంతుని కడకేగి) మహాత్మా! మీదర్శనమువలన ధన్యురాలనైతిని.

వసం॥ (కన్నులదెరచి) కళ్యాణమస్తు! సుందరీ! నీతలిదండ్రులెవరు? ఇట్లొంటరిగ నుండుటకు గతంబేమి?

చెల్లి॥ స్వామీ! నేను దేవకన్యకను. విహారార్థమైవచ్చితిని. తమ మహాత్మ్యమునెఱింగి, సందియము నివారించుకొనుటకు తమసన్నిధానమును జేరితిని.

వసం॥ కోమలీ ! మంచిపనిచేసితివి. నీసందియ మేదియో వినఁగోరెదను.

చెల్లె॥ ఆర్యా ! తమకు తెలియదా ?

కం॥ తనవరుఁడెవఁడో, యెంతటి
ఘనుఁడో ? రూపంబదెంతొ ? కఠినుఁడొ ? కాఁడో ?
యనుదలఁపులు సకలస్త్రీ
జనముల బాధించుచుండుఁ జాలమహాత్మా ॥ 174

మఱియును మహర్షిశ్రేష్ఠా !

కం॥ తెలిదండ్రు లెంతనాకిఁక
జెలియకుఁ జేపట్టినట్టి చెలికాఁడెయగున్
జెలువము వానివినాగా
గలుగదు పరమింతయైన గాదే యార్యా ॥ 175

చనవున మిమ్మడిగినందులకు మన్నింపవలెను.

వస॥ (స్వగతము) ఆహా ! ఈయన్నుమిన్నకింకను వివాహముకాలేదట. నాపూర్వ పుణ్యము మంచిది. ఇట్టిసుందరిని జేపట్టినదే జన్మము.

కం॥ ఆరూపం బావినయము
ఆరమణీయమును సుందరాకారములే
ఔరా ! మనుజులలోనీ
నారీరత్నమునుగూడినఁ బుణ్యమగున్ ॥ 176

(ప్రకాశముగ) సుందరీ ! నీయెడ నాకత్యంతానురాగము గలిగినది. నీకు తగు వరుడొకడుగలడు. వానిని వివాహమాడిన నీకు సకలభోగము లమరగలవు. జ్ఞానదృష్టిని జూడ నీకు మనుజుడు భర్తకాఁగలడని తెలియుచున్నది. నీయభిప్రాయమేమి ?

చెల్లె॥ స్వామీ ! అటులనెయున్న నేను తప్పించుకొనఁగలనా?

వసం॥ సుందరీ ! ఎట్టివాడు నీకు నాధుడుగ నుండవలెను ?

చెల్లె॥ ఆర్యా ! ఈవిషయము మేమువచింప తగినదికాదు. దేవర యెఱిగియేయుందురు.

ఆ-వె॥ చిన్నవయసువాఁడు మన్ననగలవాఁడు
పేదసాదలనిన నాదరించు

వాడు, దయనుజూపు • వాడు, సుందరుడు, నా
పతిగనున్న, జాలు • పరమపురుష ॥ 177

వసం॥ మానినీ ! చక్కగాబలికితివి. నేనొక మాటచెప్పెదను. నీకు కోపములేదుగదా?

చెల్లి॥ తమయాజ్ఞ లామోదించుటకు సిద్ధముగానున్నాను.

వసం॥ మనోహరీ ! నాయట్టివాడు నీకు పతిగనుండుటకు తగదా ?

చెల్లి॥ మహాశయా! తాము సన్యాసులుగదా! తమకు వివాహ మేమి? సంసార మేమి? తమరిట్లాడ జెల్లునా ?

వసం॥ సుందరీ ! నిక్కముచించెదను.

గీ॥ పూర్ణచంద్రుని నెగడు నీ • మోముజూచి
మనసుతాళకయున్న దే • మనివచింతు ;
ఇనుపగోచీల బిగియించు • మునులకైన
వశముగానిది నాకెట్లు • వశములలన ॥ 178

చెల్లి॥ ఔరా ! తాము దొంగస్వాములని యిప్పుడు తెలియవచ్చె. అయ్యో ! ఇంత స్థిరచిత్తములేనివాడవు జపతపములకెట్లు గూర్చుంటివయ్యా ? స్వామీ ! ఇదియేనా తాముచేయుజపము ? ఈసన్యాసివేషమేమి ? ఈజడలేమి ? ఈ వస్త్రములేమి ? ఆర్యా ! నన్ను వివాహమాడుమనుచున్నారు. బాగుగనె యున్నది.

కం॥ నిలిచితిరి విటపిసీమల
నిలువెల్ల విభూతిధార • ణే ; యికమీతో
గలిసిన నేనును యోగిని
బలెదిరుగగవలదె ? యింత • పాపముగలదే ? ॥ 179

వసం॥ ప్రాణేశ్వరీ ! నేను సన్యాసినిగాను. రాసుతుడను. నీకు తగినవాడను.

గీ॥ కలదురాజ్యంబు, సంపద • గలదునాకు
నేను రాపట్టినిప్పుడు • నిక్కముగను
రాజునగుదును, వేయేల • రమణినీకు
సకలభోగములమరు ని • స్సంశయముగ ॥ 180

చెల్లె॥ ఇప్పుడు నాసంశయము దీరినది. తాము తమ నిజాకారమున నాకు దర్శనమొసంగి కృతార్థురాలను జేయుడు.

వసం॥ ఇప్పుడె నిజాకారమును జూపెదను.

(అని నిష్క్రమించును.)

(స్త్రీ తన నిజాకారమగు యోగీశ్వరాకారముగ మారును.)

యోగి॥ ఇప్పటికి వసంతుని దృఢచిత్తము తేటఁబడినది.

చ॥ వలదని రాజ్యభోగములు ♦ బంధులు భార్యయు సర్వసంపదల్
వలదని రాజ్యమొల్లనని ♦ బల్కినపల్కులు కల్లలయ్యె; కో
మలిఁగనినంత వెంటబడి ♦ మచ్చికమీఱఁగ సంభ్రమంబునన్
వలపునఁగోరె రాసుతుని ♦ భావము తేటపడంగ వైలమే ॥ 181

అందున నేమియాశ్చర్యము ?

మ॥ ఘనులై పావనులై తదేకమతులై ♦ కామాదిభోగంబులన్
గనకే భక్తి నుమామనోహరుని సం♦కల్పించి పూజించు స
న్మునులే కాంతలఁజూచి చిత్తవడి వ్యా♦మోహంబునన్ గూడఁగాఁ
జనునా? రాజులు మిన్నకుందురటలు, యా♦సల్ మాని నిశ్చింతతో ॥

నేను ముసుగుపెట్టుకొని కూర్చుండెదను రానిమ్ము.

(ప్రవేశము - వసంతుడు రాజవేషమున.)

వసం॥ ఆహా! దేవతాస్త్రీలఁగూడు భాగ్యము నేటికి నాకులభించినది.

గీ॥ ఇంతి తానిటువచ్చి నా♦చెంతఁజేరి
వలపులనుజూపి ననుగూడ ♦ దలపు తెలిపి
నన్ను పరిణయమాడగా ♦ నున్నదింత
కన్న నెక్కుడుపున్నెమే ♦ మున్నదిలను ॥ 183

నామది నెఱుగుటకు ముసుకుపెట్టుకొనియున్నది. మనోహారీ! ఇంకను నన్నేమిటికి పట్టిచూచెదవు? నేను తాళగలనా? ఇట్లుండుటయు మనోహరముగనెయున్నది.

గీ॥ పిలిచిపిలువకవచ్చిన ♦ విలువకొంత
తగ్గునని బింకమునుజూప ♦ దలచినావు

గాజుతాలకు గోప్యము, గాని ; శుద్ధ
వజ్రముల కేల మర్మముల్ • పాటిగావు ॥ 184

నన్నొకసారి నీసత్కరుణావీక్షణములచేఁ దిలకింపుమా.

(అని వస్త్రమునుదీయును.) (యోగినిజూచును.)

వస॥ (స్వగతము) అక్కటా! మోసమువచ్చెగదా? అయ్యో! ఇంత చపలచిత్తుఁడ నైతినేమి? యోగిని సైతముఁదూలనాడితినే? అతడు నన్నిపుడు క్షమించునా? నాదృఢనిశ్చయమును గుర్తెఱుంగుటకు యోగీశ్వరుఁడే యిట్టిమాయలఁ గల్పించెను. నిజము. నేనతని శరణుజొచ్చి మన్నింపుడని ప్రార్థించుటకన్న, వేరుసదుపాయము లేదు.

(ప్రకాశముగ) స్వామీ! మన్నింపవలెను. నాలోపము నాకెబోధపడెను. నేను చపలచిత్తుఁడను. తమయాజ్ఞలకుఁ బాత్రుఁడను.

కం॥ వనితారత్నముఁ గనినం
తనె, వైరాగ్యంబుసెడె, ముఖంబునమోహం
బున దానిపొందుగోరితి
మనమును నూనాస్త్రిడెలమి • మార్చును జేసెఁ ॥ 185

క్షమింపవలయు.

యోగి॥ రాజా! ఈవైరాగ్యము స్థిరముకాదని నేను బలుకలేదా?

గీ॥ పసుచువారిలు దృషమదిఁ • బద్మనాభుఁ
గొలుచుటలుకల్ల కొన్నినాళ్లులుసుఖించి
తనివితీరినవెనుక వార్ధక్యదశను
నచ్యుతుని గొల్వగానొప్పు • నఖిలజనులు ॥ 186

గాన నీవు సతీయుతుఁడవై రాజ్యమునకేగి,

గీ॥ ధాత్రిచిరకాలమేలి సద్ధర్మబుద్ధి
సంతతినిబొంది సత్కీర్తి • శాశ్వతముగ
నిలిపి వార్ధక్యదశనుని • శ్చలతనీశు
గొలిచి మోక్షముగనుగాత • గలుగుగాత ॥ 187

వసం॥ తమయాజ్ఞానుసారముగ వర్తించెదను. తమదయ.

యో॥ వసంతా ! నీకు సంశయములేదు. నేనును మీవెంట రాజ్యమునకువచ్చి, మిమ్ము లను బట్టాభిషిక్తులఁజేసి, మరల నాకుటీరమునకు వచ్చెదను. నావెంటరమ్ము.

(నిష్క్రమించుదురు.)

---

## పంచమాంకము - చతుర్థరంగము.

(ప్రవేశము - సేవకుడు, చతురిక.)

సేవ॥ ప్రేయసీ ! ఇప్పుడు నాకు నెమ్మదిగలిగినది.

గీ॥ తుచ్ఛభోగంబులనుగోరి ♦ దొంగవలెను
రాజనగరుల మెలగుచుఁ ♦ బూజనీయు
డైనరాజును జెడిపిన ♦ యధముఁడు తుద
ముట్టఁజూచితి నాపూర్వ ♦ పుణ్యముననను ॥ 188

ఆశకుమితిలేక మదనాదేవిని లక్ష్యపెట్టక, ఆమెను నిర్బంధమున నిలిపినదిగాక, చంపనెంచి విషమొసంగ, దేవిగారెఱుగక దానినిపుచ్చుకొని, నిజముగ్రహించి, బల్లె ముతోఁ గడుపునుభేదించి వానినిజంపి తానును జనిపోయెను. ఆహా! కాలమునకెంతటి మార్పుకలిగినది? మనకు రాజులేడు. రాజ్యము చెడిపోవుచున్నది. గాన మన మీయుడ పులదిరిగి వసంతరాజున కీవార్తఁదెలిపి, రాజ్యమునకురమ్మని వేడెదము. నీయభిప్రాయ మేమి?

చతు॥ ఇంతపాపమునకుఁ గారణము మదనాదేవిగాని యితరులుగారు. వలదని బలి మినిబోధించినను వినెనా ? తత్ఫల మనుభవింపకఁ దప్పెనా ?

కం॥ వలపున సవతికుమారుని
బలిమిని వరియించినట్టి ♦ పాపము, సుతునిన్
దలనఱికించిన పాపము,
దలకక విభుఁజంపుటయును ♦ దప్పినడచునే ? ॥ 189

దుష్కృత్యఫల మామెయనుభవించినది. తనసేవకునకు భానిసరాయి మెలగినది. కడకు నీచమున మరణించినది. నాకామెయెడ పశ్చాత్తాపములేదు. మన వసంతప్రభలను వెదకి కలిసికొని వారినిప్రార్థించి రాజ్యమున నిలుపుటయె మనపని. వెదకుటకురమ్ము.

(ఇరువురు నిష్క్రమించుదురు.)

## పంచమాంకము - పంచమరంగము,

### పట్టాభిషేకము.

—{ ప్రవేశము—యోగీశ్వరుఁడు, వసంతప్రభలు. సేవకుఁడు - చతురిక - మంత్రులు. }—

(యోగీశ్వరుఁడు వసంతప్రభలను సింహాసనాసీనులఁ జేసి)

యోగి॥ వసంతరాజా ! నీవు సద్ధర్ముఁడవు. సద్గుణుఁడవు. శాంతుఁడవు. నీకు సకలశుభములగును. నీసతి పతివ్రతాశిరోమణి. మీకు సత్సంతానముగలుగును. వంశమభివృద్ధియగును.

మ॥ ధరనన్యాయమడంచి, దుష్టజనులన్ • దండించి, శిష్టాళినె
ల్లరహిన్ ప్రేముడినాదరించి, సతినిన్ • లాలించి, యాపైగ పీ
శ్వరులన్ భక్తినిసత్కరించి, జనులం•బాలించి, ధర్మంబునే
మరకే రాజ్యమునేలికొంచు మనుమా • మాదీవనల్ బొందుమా ॥

ప్రపంచము సుఖించునుగాత.

(అవనిక జారును.)

అనుబంధము 1.

గేయము.

మదన॥ మారుడు గ్రతర బాణము లేయనే
దారినిబోదు నిం కెట్లు
ఘోర బాధలంబొంది గుందుచుమనుటయె
భారమైదోచె నిం కెట్లు ॥ మారు॥
రాపట్టి కౌగిట రంజిల్లుచుండనా
తాపము చల్లార దే,
భూపాలమౌళీ, ఈపాపము సేయగ
నోపుదా ? యనిచింత సేతు ॥ మారు॥

అనుబంధము 2.

గేయము.

చతురిక॥ ఇక నేమి సేతు నే - అకటా! నామాటవినదె ॥
సుకుమారు డేకడు - సుగుణుడు దారుండై
వికలితమతి నై - విషయమెల్లెఱిగింతు ॥ ఇ॥
బలిమిని యెంతగ - బలికినగిన్కచే
పలువిధములగు నిం-దలసేయసాగె హా ॥ ఇ॥

అనుబంధము 3.

గేయము.

సనం॥ తెలియక మోసపోతి - పొలతిమానసమింత
వెలికెటుబోవంగనగునో ? ॥ తెలి॥
కలుషహృదయమున - గడుతమి జెందితన
చెలినిబంపెను, యిం-తులనమ్మరాదుగా॥ తెలి॥
తనయుడనని యైన - వనితదలంపక
కనుబలిమినినోరం - గనువింతగాందోచె ॥ తెలి॥

## అనుబంధము 4.

### గేయము.

మద॥ ఇంతపంతమేలా? భూ-కాంతనీకుఁ జెల్లునె? ॥

వసం॥ ఆలకింపుమా, మొర-నాలకింపుమా అమ్మా ॥

మద॥ ఇంతితానెగోరున - దెంతభాగ్యమోకదా
ఇంతయేని నీమది - జింతసేయ వేమి సేతు ॥ ఇంత॥

వసం॥ చాలునమ్మ నేవిన - జాలనమ్మ ఈపని
మేలటమ్మ, లోకము - మెచ్చునమ్మ అమ్మరో ॥ ఆల॥

మద॥ ఎంతవేసివారలో - చింతమానిచక్కని
కాంతలన్న పైబడి - కాము కేళిగూడరే ॥ ఇంత॥

వసం॥ మేలుమేలుతల్లిరో - మించెనీకుబుద్ధులు
బాలునేతనయునకు - బోధలిట్లు సేయుట ॥ ఆల॥

## అనుబంధము 5.

### గేయము.

మద॥ రాసుత! గుణరంజిత! రతి-రాజసమానా!
నీసురూపము నింతజూచుచు - నేమననౌనా? ॥ రా॥

వసం॥ అమ్మనీ హృదయమ్మదెట్టుల - సమ్మతించెను? చిత్రమా
నమ్మమా గహనమ్మునాశర-ణమ్మటంచు దలంపుమా॥ అ॥

మద॥ ఎన్నిభంగుల విన్నవించిన - నన్ను నాదరణింతువే
నిన్నెనమ్మితి నీపదాబ్జము - లెన్ను దుర్గ ననుగావవే ॥

వసం॥ అమ్మవు కలుషమ్మున వం-శమ్మునుగనకే
ఇమ్మహిమాకీర్తి నీగతి-వమ్ముసేయకే. అ॥

## అనుబంధము 6.

### గేయము.

వసంతప్రఢలిపవృపను

అపారప్రేమను, గృపాకరీ! మహాదపాయమున్ దునుమాడవే
కపాలధారిణి! సుపావనీ! మము, గృపామతిన్ గనుచుండవే ।
దురంతచింతల, నిరంతమెట్టుల, భరింతుమే? అవిబాపవే,
హరించుపాపము, ధరించుశాంతము, భరించిదీనుల గావవే ॥

## అనుబంధము 7.

### గేయము.

సేనా॥ తెలిసెను నాకిపుడునిజము ।
కొలపాతకి సుతునిగోరుట ॥ తె॥
వలపుననీదేవి మదన – పరుగెత్తుచువచ్చెగహాన
ములకతిమోదము మీఱగ – మోహామపాపముగదహా ॥ తె॥
వినలేదిదివరకెన్నడు – గనలేదీగతిజగమున
మనమునజంకకగోరె, కు–మారుని, మారునిగా హా ॥ తె॥

## అనుబంధము 8.

### గేయము.

ప్రభ॥ మనవిని వినినను గావుము
అనఘా! ప్రాణేశ! వైలము ॥
ఇలగలప్రాణులకెపుడో – గలుగునుమృత్యువు తప్పదు
తొలగెదమీసన్నిధిఁ గు–తూహలమున జీవములను ॥ మ॥
చనవుననో, మోహమునకో – సరసముననో, నవ్వుననో
అనఘా! నేజేసిన లో–పాళిని మన్నింపవలయు ॥ మ॥

అనుబంధము 9.

గేయము.

చతురిక॥ ఎంతనివిలపింతును యిం-కెంత తాళుదుఁన్
సంతతమానీచుడింటనె - సంతసింపగా ॥ ఎంత॥
వెఱవదు, వానిని - విడువదు ; మానిని
మఱచెను ; సర్వము - మానము ప్రాణము ॥ ఎంత॥
నరపతివినినన్ - కరవాలంబున
శిరమునుదీయునని - చెనటులుదలపరే? ॥ ఎంత॥

అనుబంధము 10.

గేయము.

వసం॥ శ్రీకరా ! వశీకరా ! శ్రీశంకరా ! నమో ॥ శ్రీ॥
పాకశాసనాదివినుత, । పార్వతీలలామకలిత,
లోకవినుతచరిత, ఫాల । లోచనా, నమోనమో ॥ శ్రీ॥

అనుబంధము 11.

గేయము

వసం॥ నినువిడచి యుండగాఁజాలా,
ననుబాసిపోవగా మేలా ? నిను॥
నినుగనగానా । వనితనుజూచిన
ఘనసంతోషముగల్గున్ ॥ నిను॥
మదిముదమొందన్ । మనిమిరుపురమున్
సదయా ! నిలిచెదమెచటన్ ॥ నిను॥

అనుబంధము 12.

గేయము.

మద॥ మనవిని, వినినా - మాటలఁదొలగకు,
మనమిరువురముచు - మడియుదుమొక్కటన్ ॥ మ॥

సేనా॥ ఇంతదురంతమా - ఈపనివమానుమా ।
కాంతుని జంపఁగ - గడఁగితివయ్యో ॥ ఇం॥

మద॥ నలుగురు వినరా - తెలుపరా రాజునకు
అలుకనుబూనడా - అటుపయి దెలియదా ॥ మ॥

సేనా॥ ఇదితగదెంతయైన - మదన! నామాటల
నెదనుదలంపుమా - యెటులైననుసరే ॥ ఇం॥

## అనుబంధము 13.

### గేయము.

రాజు॥ వినవిన చిత్రమై - దనరెనీకథయెల్ల ।
ననుబోలువారలెం - దునగానిగలరె ॥ విన॥
తనయునిజంపిన - వనితనుగంటినే ।
ఘనతరదుఃఖము - గదతలచినయంత ॥ విన॥
అదిచాలకను నను - మదముఁజంపగ
నెదలోనదలచెను - ముదితలగుణముల ॥ విన॥

## అనుబంధము 14.

### గేయము.

పౌరులు॥ అయ్యయ్యో, ఎట్టిపాటుగల్గె; మా
యయ్యనాకము జేరఁబోవగా ॥ అ॥
ధరనొక నీచుండేలగ,
వెరవేదియు మాకుదోపక
హరిహరియని నీయడపుల
దిరుగగనాయెను మాగతి ॥ అ॥

## అనుబాధము 15.

### గేయ ము.

మద॥ ఇంతటియోగంబు - నెట్లుభరింతునో
చింతసేయగజాలనే ॥
ఎంతటిరాణికి - యెంతటిదుస్థితి
ఇంతయునాపాప - మేగద? దలపోయ ॥ ఇం॥
కన్న నాపుత్రుని - కనులముందరజంప
గనచూచుచూాశిన - ఘనపాపిని నేను
నన్ను మన్నించిన - నాప్రాణవిభునకుఁ
గ్రన్ననవిషమిడిన - ఘనపాపిని నేను ॥ ఇం॥

### మంగళము

(అందరునుగలిసి పాడుదురు.)

నీదివ్యచరణములకు నిత్యజయమంగళం ॥ నీ॥
సకలయోగీశ్వరులు నమస్కారములు జేయంగదనరెడి ॥ నీ॥
హానిశాపోపహతి రాతిగ - మారగా సతిబ్రోవగల్గిన ॥ నీ॥
రంజితములై నిరతమును శ్రీ - రామకవినుతమైవిరాజిలు ॥ నీ॥



ఈపుస్తకము కావలసినవారికి అడ్రసు
వై. అం దు కం పెని,
ఈశాక్సు బిల్డింగు,
కాల్బదేవి, బొం బ యి,